


నా అర్ధాంగి శ్రీమతి ప్రమీల తో

# ప్రమీలా త్రిశతి

( స్మృతి కావ్యం )

ఆచార్య మసన చెన్నప్ప

ప్రచురణ

**ప్రమీలా శక్తిపీఠం**

హైదరాబాద్

# ప్రమీలా త్రిశతి

# PRAMEELA THRISHATHI

( Elegy )

By

**Prof. Masana Chennappa**
**HEAD (Retd)** Dept. of Telugu
Osmania University, Hyd - 7



First Published : 2016

Copies : 1000
Price: Rs. 50/-

For Copies :

**Prameela Prachuranalu**
9-76/2, Udaynagar Colony,
Boduppal, Hyderabad - 92.
Phone : 040-27201007 Cell: 98856 54381
masanachennappa@yahoo.co.in

**Navodaya Book House**
Kachiguda 'x ' Roads, Hyderabad

**Telangana Saraswatha Parishath**
Tilak Road, Hyderabad - 1

Printing:
**Mounicagraphics**
1-4-27/71/187,
Padmashali Colony,
Gandhinagar, Hyderabad
Cell: 9391041546 email: mounicagraphics@yahoo.co.in

# విలాపస్మృతి గీతి - ప్రమీలా త్రిశతి

ఈ ప్రమీలాత్రిశతి ఇటీవలవచ్చిన విషాదస్మృతి కావ్యాలలో ఒకటి. కర్త ఉస్మానియా విశ్వ విద్యాలయంలో మాకు శిష్యుడైన చిరంజీవి ఆచార్య మసన చెన్నప్పకవి.

లౌకిక జీవితంలోని యెదబాటువల్ల కలిగిన ఖేదమే ఒక్కొక్కసారి భావతీవ్రతనుబట్టి అలౌకిక కావ్యజీవితంలో రసత్వాన్ని భజించి ఆస్వాద్య మౌతూ ఉంటుందని అనుభవజ్ఞులైన పెద్దలంటారు. కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఒకసారి మాటల సందర్భంలో ఇలా అన్నారు. అయినవారికైతే దుఃఖమే గానీ, అది కావ్య రూపాన పెరవారికి రసమే అని. పేరును బట్టి యీ కృతి, అచ్చంగా విశ్వనాథవారి 'వరలక్ష్మీ త్రిశతి'ని స్మృతికి తెచ్చేదే కావచ్చును గాని అనుకరణం మాత్రం కాదు. ఎందుకంటే 'త్రిశతి' అనే నామ సామ్యమున్నా రచనలో 'తనదైన అనుభూతి తనదిగా' తోచే ముద్ర ఉన్నది. ఏ విషాదమోహనమో, వరలక్ష్మీ త్రిశతో తరగతిలో పాఠం చెప్పినపుడు వినేవారి, చెప్పేవారి మాట ఎలా ఉన్నా అయినవారు దగ్గరుంటే మాత్రం వారికళ్ళు చెమర్చక తప్పవు.

ఒకసారి కృష్ణదేవరాయ భాషానిలయంలో విశ్వనాథవారి ఖండ కావ్యాలలోని వరలక్ష్మీత్రిశతిని గురించి పత్రసమర్పణం చేస్తున్నప్పుడు బయట కూచుని వింటున్న విశ్వనాథవారి కళ్ళు చెమర్చినవని వెంటనున్న వారు తరువాత చెప్పగా నేను విన్నమాట! ఘటన జరిగిన కాలాంతరంలో కలిగే అట్టి అనుభూతి దశలోని స్పర్శ లౌకికమా లేక అలౌకికమా అంటే తేల్చి చెప్పడం కష్టమే. అది స్మృతిమీద ఆధారపడ్డ ఒక కలగలుపు భావన!

సాధారణంగా సామాజికుడైన మనిషి, సృష్టిలో భాగాలైన రాయిరప్పలతోనో, పూలమొక్కలతోనో, పశుపక్ష్యాదులతోనో, పరస్పరం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో మాత్రమే కాక తనలోతానుగా సల్లాపాలో, విలాపాలో జరుపుకోవడం ప్రకృతిలో మనం గమనించే అతి సహజమైన మానసికస్థితి. అలాంటి సన్నివేశాలన్నీకూడా సహృదయుల హృదయాల్ని కరిగించి కదిలించేవిగానే ఉంటాయి.

శకుంతల ఆశ్రమపదాన్ని విడిచి వెళ్ళవలసి వచ్చినపుడు అక్కడి లతానికుంజాలు ఆమె కట్టిన నార చీర చెంగుపట్టుకుని వదలలేకపోయినవని కవి హృదయం భావించినప్పుడూ, కవికులగురువైన కాళిదాసు మాటలు కణ్వమహర్షి కళ్ళల్లో నీళ్ళసుడులు తిప్పించినప్పుడూ, ధీరోదాత్తుడైన శ్రీరాముడు సీతా వియోగం తనకు దుర్భరమై పుక్కిలింతలుకాగా చెట్లూచేమలను దీనంగా వేడుకొన్నప్పుడూ, విక్రమోర్వశీయంలో నాయకుడు ప్రియురాలికోసం కొండల్నీ కోనల్నీ ప్రతిస్పందనలతో ప్రతిధ్వనించే విధంగా భావన చేసినప్పుడూ ఎదురైన సన్నివేశాలన్నీ అట్టి మానసికస్థితి లోనివే కదా!

క్రౌంచమిథునకథ చెప్పినట్లు ఏ జీవీ ఒంటరితనాన్ని భరించలేకపోవడమే అందుకు ప్రధాన కారణం కావచ్చు. ఒకటి రెండై ఇలలో నిలదొక్కుకోవాలనుకునే పారమార్థిక వినోదలీలా కాంక్ష ఒక ప్రక్కా, తిరిగీ ఆరెండూ రెండుగా ఉంటూనే, ఒకటై రమిస్తూ భజిస్తూ శాశ్వతత్వాన్ని సాధించుకోవాలనుకొనే విశిష్టమైన అద్వైతానుభూతి తీవ్రత మరొక ప్రక్కా ఉండి-అందుకు విఘాతం కలిగినపుడు ఆ రెండు భావనల మధ్య జరిగే సంఘర్షణలోనుంచి పుడుతుంది స్మృతికావ్యం.

తెరలు తెరలుగా ఎగిరిపడే యెడద కడలి తరంగాల ఉప్పొంగే ఈ చిరంజీవి 'ప్రమీలా త్రిశతి' కావ్యగాథ భావనలోనూ, భాషలోనూ, పలుకుబడిలోనూ దేశీయతను, సారళ్యమును, నవ్యతను సంతరించుకొన్న స్మృతిగీతి. సహృదయ హృదయ తర్పణంగా ఉన్నది.

"కాలము గాయము మాన్చును
కాలమె కష్టంబునాపు; కలతలు దీర్చున్
కాలమె యన్నియు గూర్చును
కాలమహిమ నీవు చూపి కదలితివమ్మా!" (249)

కాలమహిమ నెరిగిన ఈ కవి దృష్టిలో, కావ్యసృష్టిలో, గృహిణియైన ప్రమీల లేని జీవనం చీకటి ఆవరించిన ఆకాశమట! పద్మం లేని సరోవరమట! మూగవోయిన పికవనమట!

"వెలుగు నింగి నుండి వేరైనయట్టుల
కలువ కొలను నుండి తొలగినట్లు
పాట పికము నుండి పారిపోయినయట్లు
కోమలాంగి! దాటు కొంటి వేమి?" (45)

ఇది యెంతటి హృద్యమైన ప్రణయ భావన!

తన కావ్య రచనా పరమార్థాన్ని గూర్చి చివరికి కవి ఏమంటున్నాడో వినండి.

"ఒక్కరి కొక్కరు తోడై
చక్కగ వసియించునట్లు, సతిపతులిరువుర్
మక్కువతో జీవింపగ
నిక్కావ్యము త్రోవ జూపు నింపుదలిర్పన్" (308)

ఈ విలాప స్మృతి గీతి కిది ముక్తాయింపు సందేశం.

ఆశీస్సులు.

10-07-2016 - వేటూరి ఆనందమూర్తి

# ప్రమీలా ప్రనిమలాక్షరభవనం

మిత్రులు ఆచార్య మసన చెన్నప్పగారు విద్వత్కవులు; విశిష్ట విమర్శకులు; ప్రముఖ పరిశోధకులు; రూపకనిర్మాతలు; అనువాదకళాప్రవీణులు; బహుగ్రంథకర్త ప్రణేతలు. 'వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయసూచిక' 'ప్రాచీన కావ్యాలు -గ్రామీణజీవన చిత్రణ' - అనే కృతులు శ్రీ చెన్నప్పగారి పరిశోధన పటిమకు ప్రబలనిదర్శనాలు. మల్లిపదాలు, నేత్రోదయం, అమృతస్వరాలు, అగ్ని స్వరాలు, చెన్నప్పనానీలు, నయాగరా, అమెరికా ఓ అమెరికా, ఆ సందూక - వంటి కావ్యాలు వారి కవితాకళా ప్రావీణ్యానికి పతాకలు. సమాలోచనం, సారస్వతలోచనం, అక్షరకేతనం మున్నగు వ్యాససంపుటాలు శ్రీ చెన్నప్పగారి సాహితీ విమర్శనచతురిమకు ప్రతీకలు. శ్రీ చెన్నప్పగారు తమ గురువులు, వేద వేదాంగపారంగతులు, బహుగ్రంథకర్తలు మాన్యశ్రీ పండితగోపదేవశాస్త్రి గారి పాదసన్నిధిలో వేదాంతాన్నీ, భారతీయ ఆర్ష విజ్ఞానాన్ని ఆర్జించినారు. శాస్త్రిగారి గురుత్వం శ్రీ చెన్నప్పగారి సాహితీజీవితంలో ఒక వెలుగు మలుపు. సమదర్శనం, బృహద్గీత, ప్రకృతి పురుష వివేకం, ఈశావాస్యం వంటి కృతులు చెన్నప్ప ఉపనిషన్మానస సరస్సులో ప్రభవించిన పద్మాలు. ఉపనిషత్తులను ముత్యాలసరాలుగా రూపొందించిన ప్రథమ అనువాదకులు ఆచార్య చెన్నప్పగారే. ఇలా ఇప్పటికి వారు నక్షత్రాల వంటి ఇరువైఏడు కృతులను విరచించి, ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలో తమ స్థానాన్ని భద్రపరచుకున్నారు.

ఇక ఈ 'ప్రమీలాత్రిశతి' ఇటీవల దివంగతురాలైన వారి శ్రీమతి ప్రమీలను గూర్చి ఆచార్య చెన్నప్పగారు పద్యరూపంగా రచించిన విషాదముక్తక స్మృతి కావ్యం. సహృదయపాఠకుల అంతరంగాలను కదలించే ఆత్మాశ్రయ కావ్యం, కరుణరసాత్మకమైన కమనీయకావ్యం.

భావకవిత్వశాఖలలో ఒకటి స్మృతికావ్యం. ఆప్తులైన వారు ఎవరైనా వారి మరణాన్ని గుర్చి స్మృతిపూర్వకంగా వ్రాసిన కావ్యం స్మృతికావ్యం. ఆంగ్లంలో దీనిని ఎలిజీ (Elegy) అంటారు.

"కాశికా విశ్వేశుఁగలసె వీరారెడ్డి
రత్నాంబరంబులే రాయఁడిచ్చు"

అనే శ్రీనాథమహాకవి చాటుపద్యం,

"ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిల్పి
కేలూత యొసఁగి యెక్కించుకొనియె"

అనే అల్లసాని పెద్దన మహాకవి చాటుపద్యం తెలుగులోని ప్రాచీన స్మృతి కావ్య ప్రారంభదశ రేఖామాత్ర తార్కాణాలు. నవ్యకవిత్వంలో స్మృతి కావ్యప్రక్రియ బహుధా వర్ధిల్లింది. శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రి, శ్రీ వడ్డాది సుబ్బారాయుడు, శ్రీరాయప్రోలు సుబ్బారావు, శ్రీ బసవరాజు అప్పారావు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ నాయని సుబ్బారావు ప్రభృతులు స్మృతికావ్యాలను రచించినారు. దేశనాయకస్మృతికి, సతీస్మృతికి, సుతాదిక స్మృతికి, ఆప్తస్మృతికి సంబంధించిన కావ్యాలు ఈ స్మృతి కావ్య వైవిధ్యాన్ని సూచిస్తున్నాయి.

తెలుగులో 'సతీస్మృతి'కి సంబంధించిన కావ్యాలలో కవి సామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'వరలక్ష్మీ త్రిశతి', శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారి 'భగ్నహృదయము', శ్రీ బాలాంత్రపు వెంకటరావుగారి 'విరహసంగీతం' వంటి కావ్యాలు ప్రసిద్ధమైనవి.

ఆచార్య మసన చెన్నప్పగారి ఈ 'ప్రమీలా త్రిశతి' కావ్యం పేరు వినగానే విశ్వనాథ వారి 'వరలక్ష్మీ త్రిశతి' వెంటనే స్ఫురిస్తుంది.

ఈ 'ప్రమీలా త్రిశతి' కరుణరసాంచితమైన కావ్యం. ఇందులో శ్రీ చెన్నప్పగారు తన పత్ని ప్రమీల మరణం వల్ల పొందిన అనంతమైన సంతాపాన్ని మూడువందలఎనిమిది పద్యాలలో వ్యక్తం చేసినారు. అందువల్ల ఈ కావ్యం విషాద నైశిత్యంతో కూడి ఉన్నది. తనకు ప్రమీల చేసిన మహోపకారాలన్నింటినీ తలచుకొని, కవి అయిన చెన్నప్పగారు ఖిన్న హృదయులైనారు. వారు తమ అర్ధాంగి సద్గుణాలను స్మృతికి తెచ్చుకొని కుమిలిపోయినారు. తమ సతి విశిష్టవ్యక్తిత్వాన్ని తలచుకుంటూ, కవి వ్రాసిన పద్యాలు కరుణ రస కల్లోలినీ తరంగాలుగా కనిపిస్తాయి. తమ అర్ధాంగి పట్ల ఈ కవికున్న అనన్యసామాన్యమైన ప్రేమ ఈ పద్యాలలో ప్రస్ఫుటమవుతుంది. ఆ ప్రేమ ప్రేరితమైన భావనావైభవం ఈ కావ్యంలో హృదయంగమంగా ప్రకటింపబడింది. వియోగ వేదనామయమైన కవి గుండెలోతులు కవితారూపాన కదలివచ్చి, పఠితల హృదయాంచలాలను కదలించివేస్తాయి. ఈ కావ్యంలోని పద్యపరంపర పరమసాధ్వి ప్రమీలాగుణసంపదకు నిలువుటద్దంలా నిలుస్తుంది.

హైదరాబాదులోని 'రామకోఠి'లో ఒక శ్రీమంతుల కుటుంబంలో పుట్టింది ప్రమీల. బంగారు రంగుతో లక్ష్మి వలె కళకళలాడే ప్రమీల 'శారదాకళాశాల'లో చదువుకున్నది. తన ఇరవైయవ ఏట చెన్నప్పగారిని పెండ్లిచేసికున్నది. కష్టాలలో కన్నీళ్లలో

తోడునీడగా నిలిచింది. అనురాగశీలయై నలుబదియేళ్లు భర్తతో కాపురం చేసింది. గుడిసెను మేడగా మార్చింది. ముగ్గురు పిల్లలను కన్నది. ముచ్చటగా అందరినీ పెద్ద చేసి పెళ్ళిళ్ళు చేసింది. మనుమలను, మనవరాళ్లను చూచి మురిసింది. భర్తతో తీర్థయాత్రలు చేసింది. అతన్ని దివ్యపథంలో నడిపింది. అందరికీ ఆత్మీయతనూ ఆతిథ్యాన్నీ అందించింది. అందరి మన్ననలను పొందింది. భర్తను సేవించింది కాని అతనిచే సేవ చేయించుకోలేదు. భర్త సుందరసౌధంలో సమున్నతదశలో పరమ సుఖశాంతులతో జీవిస్తూ, పదిమందిలో భాసించేలాగా అతని యశస్సు కోసం రేయింబవళ్లు కృషి చేసింది. అరువై ఏళ్ల వయస్సులో అనుకోకుండా అనారోగ్యానికి గురియై ఆసుపత్రిపాలై, శరీరాన్ని పంచభూతాలకు పంచి, దివికి వెళ్లిపోయింది. సతీమరణం దుర్భరం కాగా, ఆమెతోడి జీవితాన్ని తలచి విలపిస్తూ, తన విలాపానికి అక్షరాకృతినిచ్చి, 'ప్రమీలాత్రిశతి'గా తీర్చినారు ఆచార్య మసన చెన్నప్పగారు. 'ప్రమీలాత్రిశతి' కావ్యమంతా, ప్రమీలాసౌశీల్యవర్ణనమే. ప్రతిపద్యం సతీపతుల అన్యోన్యానురాగ రస నిర్భరమే. ప్రతిచరణం ఆ పరమసాధ్వి సేవానిరతి ప్రస్తుతియే. అక్షరాక్షరంలో ఆ అమృతమూర్తి సద్గుణసంస్తవమే. అందువల్ల కవి యొక్క భావాభివ్యక్తి సౌందర్యాన్ని సందర్శిద్దాం.

కావ్య ప్రథమపద్యంలో తన పత్ని ప్రమీల పట్ల గల ప్రణయబంధాన్ని ఉదాత్తంగా ఉల్లేఖించినారు చెన్నప్పగారు ఇలా–

"అర్ధాంగి వనుమాట అర్ధ సత్యమె గాని
    పూర్ణాంగి వనుటయే పొసగునాకు
ఇల్లాలి వనుమాట ఇంతంతయే గాని
    యింటి దేవత వన నెలమి నాకు
గేస్తురాలనుమాట కేవలంబౌ గాని
    గృహలక్ష్మి యన్నచో గెలుపు నాకు
ప్రేయసి యను మాట ప్రియమైనదే గాని
    సహధర్మచరి యన్న చాలు నాకు

రాణివా? నీవు మద్గృహరాజ్ఞి వీవు
ఇంతివా? నీవు నా నేత్ర కాంతి వీవు
వధువువా? నీవు జీవన మధువు వీవు
పత్నివా? ఓ ప్రమీల నా ప్రాణమీవు"

తోడునీడగా నిలిచింది. అనురాగశీలయై నలుబదియేళ్లు భర్తతో కాపురం చేసింది. గుడిసెను మేడగా మార్చింది. ముగ్గురు పిల్లలను కన్నది. ముచ్చటగా అందరినీ పెద్ద చేసి పెళ్ళిళ్ళు చేసింది. మనుమలను, మనవరాళ్లను చూచి మురిసింది. భర్తతో తీర్థయాత్రలు చేసింది. అతన్ని దివ్యపథంలో నడిపింది. అందరికీ ఆత్మీయతనూ ఆతిథ్యాన్నీ అందించింది. అందరి మన్ననలను పొందింది. భర్తను సేవించింది కాని అతనిచే సేవ చేయించుకోలేదు. భర్త సుందరసౌధంలో సమున్నతదశలో పరమ సుఖశాంతులతో జీవిస్తూ, పదిమందిలో భాసించేలాగా అతని యశస్సు కోసం రేయింబవళ్లు కృషి చేసింది. అరువై ఏళ్ల వయస్సులో అనుకోకుండా అనారోగ్యానికి గురియై ఆసుపత్రిపాలై, శరీరాన్ని పంచభూతాలకు పంచి, దివికి వెళ్లిపోయింది. సతీమరణం దుర్భరం కాగా, ఆమెతోడి జీవితాన్ని తలచి విలపిస్తూ, తన విలాపానికి అక్షరాకృతినిచ్చి, 'ప్రమీలాత్రిశతి'గా తీర్చినారు ఆచార్య మనన చెన్నప్పగారు. 'ప్రమీలాత్రిశతి' కావ్యమంతా, ప్రమీలాసౌశీల్యవర్ణనమే. ప్రతిపద్యం సతీపతుల అన్యోన్యానురాగ రస నిర్భరమే. ప్రతిచరణం ఆ పరమసాధ్వి సేవానిరతి ప్రస్తుతియే. అక్షరాక్షరంలో ఆ అమృతమూర్తి సద్గుణసంస్తవమే. అందువల్ల కవి యొక్క భావాభివ్యక్తి సౌందర్యాన్ని సందర్శిద్దాం.

కావ్య ప్రథమపద్యంలో తన పత్ని ప్రమీల పట్ల గల ప్రణయబంధాన్ని ఉదాత్తంగా ఉల్లేఖించినారు చెన్నప్పగారు ఇలా–

"అర్ధాంగి వనుమాట అర్ధ సత్యమె గాని
        పూర్ణాంగి వనుటయే పొసగునాకు
ఇల్లాలి వనుమాట ఇంతంతయే గాని
        యింటి దేవత వన నెలమి నాకు
గేస్తురాలనుమాట కేవలంబౌ గాని
        గృహలక్ష్మి యన్నచో గెలుపు నాకు
ప్రేయసి యను మాట ప్రియమైనదే గాని
        సహధర్మచరి యన్న చాలు నాకు

రాణివా? నీవు మద్గృహరాజ్ఞి వీవు
ఇంతివా? నీవు నా నేత్ర కాంతి వీవు
వధువువా? నీవు జీవన మధువు వీవు
పత్నివా? ఓ ప్రమీల నా ప్రాణమీవు"

మహిళా లక్షణ లక్షితమైన చక్కని పద్యం ఇది. ఆమె ఉన్నచోట ఎన్నో 'పున్నమల వెలుగు', ఎన్నో 'ఇంద్రధనుస్సులు' విరిసి కనిపిస్తాయి.

చెన్నప్పగారు తమ పత్నియైన ప్రమీలపై అనేక విషయాలలో ఆధారపడ్డారు. ఎలా? అంటే ఇట్లా-

"పాప తల్లిపై ఆధారపడిన యట్లు
పంట వానపై ఆధారపడిన యట్లు
పలుకు గురువుపై ఆధారపడిన రీతి" (30)

ఈ పద్యం చెన్నప్పగారి లోకజ్ఞతనూ, వాగ్వైభవం గురుదత్తమనే ఆయన ఆర్ష విజ్ఞాన సంపదనూ వ్యక్తం చేస్తున్నది. వారు గురుదత్త ఉపనిషచ్చతురవచోనిధులు కదా!

ప్రమీల తన్ను ఎలా విడచిపోయిందో కవితాత్మకంగా చెప్పినారు చెన్నప్ప ఇలా-

"వెలుగు నింగి నుండి వేరైన యట్లుల
కలువ కొలను నుండి తొలగినట్లు
పాట పికము నుండి పారిపోయినయట్లు" (45)

అందుకే ఆమె లేని ఆయన పరిస్థితి- వెలుగులేని నింగి; కలువలేని కొలను; పాటలేని కోయిల. ఇలాంటి కమనీయ పద్యాలే కవిని కలకాలం నిలుపుతాయి. కవిని కాలవిజేతగా రాణింపజేస్తాయి.

"ఇంతి నీ చేతిముద్ద పిహెచ్.డి యంత" అనే చరణం చరణం కాదు ఈ కవి ప్రతిభా కిరణం. ఇలా అనడం ఒక్క కవి చెన్నప్పకే సాధ్యం. కవి భువి లాంటివాడు. అన్నింటినీ తనలోపలే సృష్టిస్తాడు.

శ్రీమతి ప్రమీలగారు ఇష్టంగా పూలమొక్కలను పెంచేది. అంతేకాదు ఆమె పెరటి మొక్కలా చక్కగా ఉండేది. ఆ పూలమొక్కను చూచినప్పుడల్లా కవి స్మృతిలో ఆమె మెదలుతుంది. అందుకే అన్నారు కవి ఇలా-

"ఆకు ఆకున నీ సుందరాననంబె
పూవు పూవున దరహాస పూర్ణమసుడె
రెమ్మరెమ్మన నీ పల్కు కమ్మదనమె
ఉవిద! పెరటిలో మొక్కవై ఉండరాద?" (52)

ఈ పద్యం ప్రమీల అందాన్ని ఒక వైపు, ఆమె త్యాగాన్ని మరోవైపు వ్యక్తం చేస్తున్నాయి. 'పూర్ణమసుడు' (చంద్రుడు) అనడం చెన్నప్ప శబ్దాధిపత్యాన్ని తెలుపుతున్నది. కవి పదాలను

ఏలేవాడు కదా! చెన్నప్పగారు పదాలను ఏలితే, చెన్నప్పగారిని ఏలినది శ్రీమతి ప్రమీల గారు.

"ఎంత ధైర్యమిచ్చి యేలితివో నన్ను
అబల గావు నీవు సబల వమ్మ!" అనే పంక్తులు అందుకు ఉదాహరణ.

"రేకు లింటిలోన రేకువై యుంటివి
పిదప కప్పువేయ పిందెవైతి
వొక్క ఫ్లోరువేయ చక్కనికాయవై
రెండు ఫ్లోర్లు వేయ పండువైతి" (131)

అనే పద్యం కష్టసుఖాలలో శ్రీమతి ప్రమీల సహజీవనాన్ని సూచిస్తున్నది. 'రేకు' అంటె, 'సిమెంటు రేకు' అనీ 'పూరేకు' అనీ అర్థద్వయం. పూరేకుగా లేకుంటె, ఆమె పిందె, కాయ, పండు కాలేదు కదా!

ఉపనిషదర్థ భాండాగార సదృశులైన పూజ్యగోపదేవుడు, కైవల్యప్రాప్తికై పరితపించే శ్రీమతి ప్రమీల గారి మోక్ష గురువు. అందువల్ల ఆమెను "ఉపనిషదర్థానివి" అని వర్ణించినారు చెన్నప్పగారు. అంతేకాదు ప్రమీల "భర్త చెన్నప్ప చెప్పెడి పద్దె"మట! అతిథి సత్కారాలందించే విషయంలో ఆమె "ప్రవరుని భార్యకీ"డట. ఆమె "పారిజాతము" లాంటి పడతి అట. 'గీతాజయంతి' సభల సందర్భంగా తమ ఇంటికి వచ్చిన చుట్టాలను ఆమె 'అన్నపూర్ణ'యై ఆదరించింది. "నా సారథి" అనీ, పేదవడిన తన బ్రతుకు పెరటిలో ఆమె "తులసిమొక్క" అనీ ప్రశంసించినారు కవి. ఆమె వల్ల ఇల్లు 'భారతీనిలయ' మైందన్నారు. ఋషి దయానందసరస్వతీ విరచిత 'సత్యార్థప్రకాశము'ను తన చేత వినిపించుకున్న ప్రమీలను, ఆర్య వనితగా ఒక 'వెలుగు'గా, ఒక 'కలిమి'గా ఒక 'దేవత'గా, ఒక 'శక్తి'గా అభివర్ణించినారు శ్రీ చెన్నప్పగారు. రుచి వల్ల 'అగ్ని'గా, రుచిచేత 'ఉదకము'గా, తన ప్రాణాలను నిలుపడం వల్ల 'ప్రాణము'గా రూపొంది, "వెరసి దేవతలకు మారుపేరు"గా భాసించిందట ప్రమీల. భర్తృప్రశంసకు నోచుకున్న ప్రమీల అక్షరాత్మక కావ్యమై వెలుగొందటం న్యాయమే కదా!

శ్రీమతి ప్రమీల భర్తతో కాశి, గయ, ఉజ్జయిని, శ్రీశైలం, భద్రాచలం, తిరుపతి ఇలా అనేక తీర్థయాత్రలు చేసింది. కన్యాకుమారి, మానసగంగోత్రి, శబరిమల, రామేశ్వరము వంటి పుణ్యక్షేత్రాలను చూడాలనుకున్నది. తనకు తగిన ఒక 'కుర్చీ'ని తెచ్చిపెట్టమని భర్తను కోరింది. కాని ఈ రెండు కోరికలు తీరకుండానే ప్రమీల స్వర్గానికి

వెళ్లిపోయింది. ఈ రెండవ కోరికను 'కుర్చీకథ' లో వివరించినారు ఆచార్య చెన్నప్పగారు.

తన్ను విడచిపోయిన ధర్మపత్ని ప్రమీల సౌశీల్యాన్ని ఇలా పలురకాలుగా ప్రశంసించి, చిట్టచివరకు

"ఎన్ని సుగుణముల్ నీలోన వన్నెగలిగి" అని తన అశక్తతను వేదనను నివేదించుకున్నారు చెన్నప్పగారు. తనకు 'ముందుచూపు' నిమ్మని స్వర్గీయ ప్రమీలను వేడుకున్నారు. తనకు ఏడుగడగా నిలిచిన ఆమె ఆకాంక్షకు అనుగుణంగా "సత్పథమున నేనింక సాగువాడ" అని తన భావిజీవిత విధానాన్ని ఆమెకు విన్నవించుకొన్నారు.

ఇప్పటి దాక ఇరువైయేడు గ్రంథాలను (నక్షత్రమాలికను) రచించిన ఆచార్య చెన్నప్ప, ఈ ఇరువై ఎనిమిదవ గ్రంథం 'ప్రమీలా త్రిశతి', "ఇరువదెనిమిదో తారగా" గగనంలో నిలిచిన ప్రమీల "స్మృతికి గౌరవ మొప్పంగ" అంకిత మిచ్చినారు.

"ఒక్కరికొక్కరు తోడై
చక్కగ వసియించునట్లు, సతిపతులిరువుర్
మక్కువతో జీవింపగ"

ఈ 'ప్రమీలా త్రిశతి' కావ్యం తోవచూపుతుందని 'ఫలశ్రుతి'ని తెలిపినారు సంప్రదాయజ్ఞులైన ఆచార్య చెన్నప్పగారు. ఆ ఆధునిక కావ్య రసజగత్తులో; 'ఫలశ్రుతి' సనాతనమైనా, వినూతనమే. దీనితో ఈ కావ్యం ముగుస్తుంది. ఈవిధంగా ఈ కృతి, విషాదకావ్యమైనా, ప్రమీలా చెన్నప్పగార్ల అన్యోన్య ప్రణయ దాంపత్య సుఖజీవితానికీ వారి విశిష్ట వ్యక్తిత్వాలకూ అక్షర దర్పణంగా అలరారుతున్నది.

ఆచార్య చెన్నప్పగారు సరస కవితా నిర్మాణ మర్మజ్ఞులు. భావాన్ని చమత్కార చతురంగా ప్రకటిస్తారు. ఉదాహరణకు ప్రమీలకు సాటి ప్రమీలయే అని చెప్పుతూ-

"ఆత్మ నిత్యమన్న అర్ధ సత్యముగాదు
నింగి శూన్య మన్న నిజముగాదు
మనిషి దేవుడన్న మర్యాదయే గాదు
నీవు నీవె యన్న నిక్క మయ్యొ" అన్నారు. మొదటి మూడు చరణాల చివర 'కాదు కాదు' అంటూ చివరి చరణం చివరకు 'అయ్యో' అని అనడం శబ్దార్థోభయ చమత్కారం.

"అమెరిక పోయి వచ్చితివి అద్భుత రీతిగ నొక్కదానివే
అమరిక జూపి వచ్చితివి అందరు మెచ్చగ"

అమెరిక-అమెరిక అనడం పదచమత్కారం.

కావ్యంలో నానా రుచిరార్థ సూక్తులుండాలని ఆదికవి నన్నయగారి అభిప్రాయం. ఆ అభిప్రాయాన్ని ఆదేశంగా భావించి, తరువాతి మహాకవులందరు ఆ మహనీయుణ్ని అనుసరించినారు; అనసరిస్తున్నారు. విద్వత్కవి అయిన చెన్నప్పగారి ఈ 'ప్రమీలాత్రిశతి'లో అనేక సూక్తి మౌక్తికాలు అందగిస్తున్నాయి. తార్కాణానికి కొన్నింటిని పేర్కొంటాను.

"నాతిలేక గుండె కోత గాదె"

"పోయినటువంటి వారితో పోము గాని
బాధపడకుండ నేరీతి బ్రతుకగలము"

"ఎంత వేదాంతియైన స్వకాంత బాసి
బ్రహ్మ మందున సుఖమును బడయగలడె?
పక్షిగూటికి దూరమై బయలు నందు
సుఖము నొందంగ సాధ్యమే సుంతయైన"

"కాయ మన్నది లేక సుఖంబు లేదు"

"ఈశ్వరుని సృష్టిలోపల నెంత తీపి"

" భార్య వల్లనే భర్తకు భాగ్యమబ్బు"

"పుట్టినప్పుడు గొప్పగా పుట్టరెవరు"

"దాత గీతనెవరు దాటగలరు?"

"ప్రకృతి కుర్చి; కూర్చొనువాడు ప్రాణి; యట్లు
చేసినటువంటి వాడె విశ్వేశ్వరుండు"

"పృథ్వివ్యాం త్రీణి రత్నాని జలమన్నం సుభాషితమ్" అని సూక్తి. జగత్తులో మూడు రత్నాలున్నాయి. అవి జలం, అన్నం, సుభాషితం. సుభాషితం అంటే సూక్తియే. జలంలాగా, అన్నంలాగా అందరికీ పుష్టినీ తుష్టినీ కలిగిస్తాయి సూక్తులు. డా. చెన్నప్పగారి ఈ సూక్తులు అలాంటివే.

ఈ 'ప్రమీలాత్రిశతి' కావ్యంలో ఆచార్య చెన్నప్పగారు "భ భ ర న మ య వ" గణాలలో ఒక పద్యం వ్రాసినారు. యతిస్థానం మత్తేభ వృత్తంలోవలె 14వ అక్షరమే. "స భ ర న మ య వ" గణాలైతే మత్తేభమవుతుంది. 'స' గణం బదులు 'భ' గణంతో పద్యాన్ని ప్రారంభించినారు. అందువల్ల ఈ పద్యం ఏ వృత్తమో! పద్యమేదైనా, 'ప్రమీలా

వృత్తమే' అనుకోవాలె. విషయం ఆమె జీవన సంబంధియే కదా!

"నా విలువంగురితించు కాలమరుదెంచన్ మీరు వీక్షింత్రు; సత్
పావనమైన చరిత్రయే నడుపు నీ బ్రహ్మాండమున్; దైవమే
త్రోవను జూపిన యట్టి మార్గమున సంతోషంబుతో బోదునం
చీవువచించిన పల్కులందు మరి యెంతే సత్యమూహించితిన్."(114)

పద్యకావ్యం అంటే సాధారణంగా గ్రాంధిక భాషా ప్రయుక్తమే. అయితే ఈ కావ్యంలో పలుచోటులందు వ్యావహారిక భాషా పదాలు ప్రయోగింపబడినాయి.

ఇంకా ఈ కావ్యంలో ఆధునిక కాలానుగుణంగా, సందర్భోచితంగా ఇంగ్లీషు, ఉర్దూ పదాలు ప్రయుక్తమైనాయి. 'ఛాలెంజి', బోరు, ఫ్లోరు, కాలని, ఓల్డ్‌సిటీ, గోల్డ్‌సిటీ, బోటు, చైరు, రైస్, సీరియల్స్, హోటల్ వంటి ఆంగ్ల పదాలు, యాది (యాద్) ఖాళివంటి ఉర్దూ పదాలు కనిపిస్తాయి. ఇవన్నీ సహజసుందరంగా ఉన్నాయి. కవి దివి లాంటివాడు. తన ప్రపంచాన్ని అక్షరం, అమరం చేస్తాడు. పుణ్యగేహిని, నిష్కామయోగిని అయిన తన పత్ని ప్రమీల అకాల మృతి కారణంగా విలపిస్తూ, ఆమె సద్గుణ సంపదను స్మృతికి తెచ్చుకొని, సత్కవులయిన శ్రీ మసన చెన్నప్పగారు కృతజ్ఞతాబద్ధులై, ఆమె పుణ్యశీలతను ప్రశంసిస్తూ, ప్రమీలకై 'త్రిశతి' రూపమైన ప్రవిమల శాశ్వతాక్షర భవనాన్ని నిర్మించి, ఆ అమరమూర్తిని అందులో ప్రతిష్ఠించి ధన్యులయ్యారు. పరోక్షంగా, ఈ ప్రశస్తకృతిలో, స్మృతికావ్య ప్రక్రియను సుసంపన్నం చేసినారు. అందుకు, వారు అభినందనీయులు.

**- డా॥ తిరుమల శ్రీనివాసాచార్య**

15-08-2016

# ఈ స్మృతి ఒక ఆరని జ్యోతి

స్త్రీ ఆదిపరాశక్తి అంశ. ఆ స్త్రీ శక్తి వల్లనే పురుషశక్తి రాణిస్తుంది. స్త్రీ లేకపోతే పురుషుని జీవితం అసంపూర్ణం. అంతేకాదు అది నిరర్థకం, నిష్ప్రయోజనం కూడా. ప్రతి పురుషునిలో స్త్రీ శక్త్యంశ గుప్తశక్తిగా భాసిస్తుంటుంది. స్త్రీ పురుషుల బంధానికి మన భారతీయ సమాజంలోని వైవాహిక వ్యవస్థ అమరత్వాన్ని సిద్ధింపజేస్తుంది. శాశ్వతత్వాన్ని ప్రాప్తింపజేస్తుంది. అందుకే అర్ధనారీశ్వర తత్త్వం భారతీయ సనాతన ధర్మంలో ఒక విశిష్టాంశం.

ఈ చరాచర సృష్టిక్రమంలో స్త్రీ పురుషులు ప్రధాన పాత్రధారులు. భార్యాభర్తల బంధం వారిని ఒకటి చేస్తుంది. వారి వల్లనే కుటుంబం, వంశం, తరం అన్నవి అవిచ్ఛిన్నంగా కొనసాగుతుంటాయి. ఆ ఇరువురు పాలు–నీరు లాగా, పూవు–తావి లాగా, శబ్దం–అర్థం లాగా, రాగం–తాళం లాగా అవిభాజ్యంగా ఉండిపోతారు.

'జాతస్య మరణమ్ ధ్రువమ్' అన్న న్యాయం మేరకు వారిలో ఎవరో ఒకరు ముందు వెనక దేహాన్ని త్యజించినా, ఆత్మగతంగా జీవించి ఉన్న వారిలో అంతర్లీనమై జీవిస్తూ ఉంటారు. లౌకిక దృష్టిలో భార్యను కోల్పోయిన భర్తగా, భర్తను పోగొట్టుకున్న భార్యగా మన చర్మ చక్షువులకు కనిపించినప్పటికీ, అలౌకికంగా అంతర్నేత్రంతో చూస్తే ఎవరూ ఎవరినీ విడిచిపోయినట్లు కనిపించదు. అంతటి బలమైనది భార్యాభర్తల బంధం.

ఈ అనుబంధానికి అక్షర సాక్ష్యమే ఆచార్య మసన చెన్నప్పగారు రచించిన ఈ 'ప్రమీలా త్రిశతి'. చెన్నప్ప గారి ధర్మపత్ని ప్రమీల గారు మనందరికీ భౌతికంగా కనిపించక పోయినప్పటికీ, చెన్నప్ప గారి స్మృతులలో, కృతులలో ఆకృతిని పొంది, ఆ అక్షరాలలో ఆమె జీవిస్తూనే ఉన్నారు. ఆయన జ్ఞాపకాలలో ఆమె పచ్చగా పల్లవిస్తూ, పరిమళిస్తూ ఆయనను అనుక్షణం ప్రేమతో పలకరిస్తూనే ఉన్నారు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో 'స్మృతి కావ్యం' రచన అన్నది ఒక విశిష్టమైన ప్రక్రియ. అయిన వారు, ఆత్మీయులు, స్నేహితులు, దేశనాయకులు మనల్ని వదిలిపెట్టి పరలోకానికి వెళ్ళినప్పుడు, వదిలి పెట్టని వారి జ్ఞాపకాలు మనల్ని వెన్నాడుతున్నప్పుడు వారి మధుర స్మృతుల్ని నెమరు వేసుకొంటూ, వారి గొప్పదనాన్ని కీర్తిస్తూ రాసే ఒక ప్రక్రియ ఈ స్మృతి కావ్యం. తెలుగులో అనేక స్మృతి కావ్యాలు వచ్చాయి. కొన్ని వైయక్తికమైనవైతే, కొన్ని సార్వజనీనమైనవిగా నిలిచిపోయినవి ఉన్నాయి. అందులోని వ్యక్తులు కొందరికే పరిచయమై, పరిమితమైనవిగా అనిపించినప్పటికీ వాటిల్లోని మానవీయ స్పర్శ,

కవిత్వాంశ, ఆ తడి అందరినీ తడుముతాయి. ఆ వ్యక్తులు అందరి వారుగా అనిపిస్తారు. ఇది మానవీయ సంబంధాలను మరింత బలోపేతం చేస్తుంది. మన సొంత మనిషినే కోల్పోయినంత బాధను కలిగిస్తుంది. పరాయి తనాన్ని పోగొట్టి 'మనం' 'మనవాళ్ళు' అన్న భావనను కలిగిస్తుంది. నిజంగా మానవీయ సంబంధాలను పటిష్టపరచడంలో 'స్మృతి కావ్యం' విశిష్టమైన పాత్రను పోషిస్తుంది.

తెలుగులో విశ్వనాథ సత్యనారాయణ గారి 'వరలక్ష్మీత్రిశతి' బాగా ప్రాచుర్యం పొందిన స్మృతి కావ్యం. ఆ తరువాత అనేక రకాల స్మృతి కావ్యాలు వచ్చి ఉండవచ్చు. కానీ ప్రస్తుతం ఆచార్య మసన చెన్నప్పగారి ఈ 'ప్రమీలా త్రిశతి' అలనాటి 'వరలక్ష్మీ త్రిశతి' ని స్ఫురింపజేస్తుంది. చెన్నప్పగారు వేదోపనిషత్తులను, పురాణేతిహాసాలను, కావ్యప్రబంధాలను, ఆధునిక సాహిత్య ధోరణులను లోతుగా అధ్యయనం చేసిన వారు. అందువల్లనే ఈ త్రిశతిలో వారి సతీమణి ప్రమీల గారు అక్షరమక్షరంలో సాక్షాత్కరిస్తారు. ప్రతి వాక్యంలో పలకరిస్తారు. ఇక ఆమెకు మరణమెక్కడిది? దైహికంగా లేకపోయినా భర్త గుండెల్లో గూడు కట్టుకొనే ఉన్నారు. అందువల్లనే ఇంతటి అద్భుతమైన స్మృతి కావ్యం అవతరించ గలిగింది. దీనిలో సంప్రదాయానుసారంగా మొత్తం 308 పద్యాలున్నాయి. ఇవి వృత్తాలు, జాతులు, ఉపజాతులకు చెందిన ఛందస్సులో రచించబడ్డాయి.

ఒక చోట-

పదవి విరమించి, క్షేత్రముల్ పర్యటించ
వచ్చునని బల్క నను నీవు మెచ్చినావు
దేవి! యొకదానివే దూర దేశములకు
తిరిగి రాకుండ వెడలిపోతివి గదేమి! (5)

అంటూ ఖేదాన్ని, నిర్వేదాన్ని ప్రకటిస్తూనే-

ఈ తనువు నాది గాదని యీవు వోవ
నెంచి నట్టుల భావింతు నిపుడు నేను;
కాకపోయిన నీవేల కష్టమనక
దేహమందున నుండవు దేవదేవి? (67)

అన్న తాత్త్వికతను వ్యక్తపరుస్తారు. చిరిగిన వస్త్రంలా ఆత్మ శరీరాన్ని విడిచిపెడుతుందన్న గీతావాక్యాన్ని గుర్తు చేస్తారు.

ప్రమీల గారి వ్యక్తిత్వం అలనాటి 'మనుచరిత్ర' లోని ప్రవరాఖ్యుని ఇల్లాలు

సోమిదమ్మ వ్యక్తిత్వాన్ని తలపింప జేస్తుంది-

"వేళ కెవ్వరైన వేడ్కతోనింటికి
వచ్చిరేని బువ్వ వండి పెట్టి
వందమందికైన వైభవంబుగ తృప్తి
నొసగునట్టి తల్లివో ప్రమీల!" (39)

ఆచార్య చెన్నప్ప గారు ఈ కృతిలో తన అర్ధాంగిని ఇరువది ఎనిమిదవ తారగా అభివర్ణించినారు

"అకట నక్షత్రమాలిక యనగ నేను
నిర్వదేడు గ్రంథాలు రచించినాను;
గౌరవంబయ్యె సాహితీ గగనమందు
నిరువదెనిమిదో తారగా నీవు నిలువ" (7)

అంటూ తనను తాను సముదాయించుకొని సంభాళించుకోవడం గుండెల్ని పిండే సన్నివేశం. ఇట్లా ఈ కావ్యమంతా ఆ దంపతుల అజరామరమైన ప్రేమవాత్సల్యానికీ, అనురాగానుబంధానికీ ప్రతీకగా రూపుదిద్దుకొంది. దీనిలో కేవలం చెన్నప్ప గారికి భార్య పట్ల ఉన్న అనురక్తియేకాదు కవితాశక్తి కూడా కనిపిస్తుంది. పద్యరచనను 'నల్లేరుపై బండి నడకలా' నడిపించగలగిన వారే ఇటువంటి రచన చేయగలరు. కరుణ రస ప్రధానమైన ఈ కావ్యంలో మాధురీగుణంతో పాటు ప్రౌఢ రచనాధురీణత కూడా ప్రదర్శితమవుతుంది. ఒక చోట ఆమెను 'స్తుతమతి!' అని సంబోధించడం ఆనాడు "స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కుల కేల గల్గెనో యతులిత మాధురీ మహిమ" అన్న ప్రబంధోక్తిని జ్ఞప్తికి తెస్తుంది.

తెలుగు సారస్వతలోకానికి ఇంత చక్కటి స్మృతి కావ్యాన్ని అందించిన ఆచార్య మసన చెన్నప్పగారు సదా అభినందనీయులు.

హైదరాబాద్
21-02-2016

- డాక్టర్ టి.గౌరీశంకర్

# చెన్నప్ప కన్నీరే ఈ కావ్యం

"కూటికేలేక చిక్కులు వడ్డ నాళ్ళలో
ఈమేను నిలిపినదీమె కొరకు
అతి వియోగపు ముష్టి నఖిల మిత్రులధనం
బెదకుంది కొనినది యీమె కొరకు
అన్నిసార్లాత్మహత్యాబుద్ధి పెడత్రోసి
యిలమీద బ్రతికినదీమె కొరకు
గదపూర్ణమైన నా కాయంబు బహుయత్న
మేచిరక్షించిన దీమె కొరకు"

అంటూ కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు తన అర్ధాంగి వరలక్ష్మి అస్తమించిన తరువాత– కన్నీరుమున్నీరై ప్రవహించిన వేళ పలవరించిన కవిత్వం 'వరలక్ష్మీత్రిశతి'. ఆయన వరలక్ష్మిని స్మరిస్తూ కురిసిన ప్రతి బాష్పం పద్యమైంది.

ఇటీవల ఆచార్య మసన చెన్నప్పగారి శ్రీమతి ప్రమీలాదేవి అకస్మాత్తుగా అస్తమించారు. ఆయన అశ్రుఝరి కవిత్వమై పొంగింది. మూడువందల ఎనిమిది పద్యాల శోక కావ్యమై అవతరించింది. ఈకావ్యం చదువుతుంటే విశ్వనాథ సత్యనారాయణ గారి వరలక్ష్మి నాతలపులో మెదిలింది. 'ప్రమీలాత్రిశతి' చెన్నప్పకవి వేదనాప్రమీలీయం!

ఆధునికయుగంలో తెలుగు సాహిత్యంలో ఎలిజీలు చాలా వచ్చినై. జీవితేశ్వరి మృతి చెందిన దుఃఖంలో లబ్ధప్రతిష్ఠులైన కవులు కావ్యాలు, గీతాలు రచించారు. దువ్వూరి రామరెడ్డి, విశ్వనాథ, కుందుర్తి, రావూరి భరద్వాజ వంటి వారు రచించిన 'ఎలిజీ'లు నేటికీ హృదయాలను ద్రవింపజేస్తూనే ఉన్నై. చదివే రసహృదయుల కళ్ళల్లో నీళ్లు తెప్పిస్తూనే ఉన్నై. చెన్నప్ప గారు ఓ కవిత్వపు ముద్ద.

సీతాదేవిని అరణ్యానికి పంపిన శ్రీరామచంద్రుడు శయ్యాగృహంలో ఆమెను తలచుకొని ఎంత విలపించాడో భవభూతికవికే తెలిసింది.

"ఇయంగేహేలక్ష్మీరియ మమృతవర్తిన్నయనయో
రసావస్యాస్పర్శో వపుషి బహుళశ్చందనరసః
అయం కంఠేబాహుః శిశిరమసృణీ మౌక్తికసరః
కిమాస్యా నప్రియం యది పరమ సహ్యస్తు విరహః?"

(ఈమె ఇంటికి లక్ష్మి. కన్నులకు అమృతవర్తి. ఈమె స్పర్శ దేహానికి చక్కని చందనరసం. నా కంఠమందలి ఈమె బాహువు ముత్యాలపేరు. ఈమెను గురించి ప్రియం కానిదేది? భరింపరానిదొక్కటే ఈమె విరహం)

చెన్నప్పకవి తొలి పద్యంలోనే ప్రమీల ఔన్నత్యాన్ని వర్ణించారు. దుఃఖవర్ణనలో భవభూతికన్న ఒక అడుగు ముందుననే వున్నారు. ప్రమీల పరమసాధ్వి. ఇంటిని వెలిగించిన గేస్తురాలు. నలువదేండ్లు చెన్నప్పగారి జీవితంలో వెన్నెలలు కురిపించిన శరజ్జ్యోత్స్న.

చెన్నప్పగారిదిప్పటికీ బాలలమానస్తత్వమే. పాపం పుణ్యం శ్లేషార్థాలు తెలియనివారు. తనను ఉన్నత శిఖరాల కెక్కించిన ప్రమీల అస్తమయం ఆయనను క్రుంగదీసింది. రెక్కలు విరిగిన పక్షి చందంగా 'పరుగుదీయంగనెట్టులో నెఱగకుంటి'. అంటూ విలపించారు

"పాప తల్లిపై ఆధారపడిన యట్లు
పంట వానపై ఆధారపడిన విధము
పలుకు గురువుపై ఆధారపడిన రీతి
పడతి! నీపైన ఆధారపడిన వాణ్ణి" – (30)

అని చెప్పడంలోనే ప్రమీలమ్మ, చెన్నప్పగారి జీవితాన్ని ఎలా వెలిగించిందో అర్థమౌతుంది. 'కార్యేషుదాసీ' అన్న శ్లోకానికి ఉదాహరణప్రాయురాలు ఆమె.

"వందనలయదు వేపురువచ్చిరేని
అన్నపూర్ణకు నుద్దియౌనతని గృహిణి" (39)

అని అల్లసానివారన్నారు. ఈ ప్రమీలమ్మ అపరసోమిదమ్మయే.

చెన్నప్పగారు పేద. ప్రమీలమ్మ భాగ్యవంతులబిడ్డ. ఈ విద్వన్మణి ఆకన్యామణిని ఇష్టంగా పెండ్లియాడడం తన భాగ్యంగా భావించారు కవి.

"రాతి భవనాన నీవుండ, ప్రక్కనున్న
రేకులింటిలో నేనుంటి లేమిచేత;
భాగ్యవశమున నిన్ను చేపట్టినంత
బౌద్ధనగరాన గట్టితి భవన మొకటి" (74)

అన్న పద్యం అందుకు దృష్టాంతం.

"ఇల్లు గొప్పదయ్యె నిల్లాలివగుటచే
మనసు గొప్పదయ్యె మాటవల్ల
బస్తి గొప్పదయ్యె పడతి! నీ వల్లనే
పేరు గొప్పదయ్యె ప్రేమవల్ల" (78)

అన్న పద్యం ప్రమీలమ్మ ప్రేమతత్త్వాన్ని ఆవిష్కరిస్తుంది.

"ఈశ్వరుని యందు భక్తి జూపించుతల్లి
దయయు సత్యమ్ములోనుగా దలచుతల్లి" (153)

"చేతులెత్తి మ్రొక్కు శీలంబు గల తల్లి
మాట మీద నిలుచు మాతృమూర్తి
ఆర్థిజనులకెల్ల అమృతంపుభాండమ్ము
పిన్నలందు గొప్ప ప్రేమమూర్తి" (154)

ఐన ప్రమీలమ్మ చెన్నప్పగారికి భార్య, ఆయన సంతానానికి అమ్మ, జననికాయానికి పూజ్యురాలు.

ప్రమీలా చెన్నప్పగార్ల దాంపత్యజీవన యత్రాస్మృతి కావ్యం ఈ ప్రమీలాత్రిశతి. కావ్యంలోని ప్రధానరసం శోకమే. ఐనా వైరాగ్యభావనతోపాటు తాత్త్వికత అంతటా పరచుకొని ఉంది.

చెన్నప్పగారు జగమెరిగిన విద్వత్కవి. వాఙ్మయబ్రహ్మ. ఉపనిషత్తులను గేయకావ్యాలుగా రచించిన ఉపనిషత్కవి. స్వయంగా 'శుకోపనిషత్తు'ను రచించి భారతీయ దాంపత్యధర్మాన్ని ప్రబోధించారు. సాహిత్యరంగంలోనూ, జీవనరంగంలోను ఆయన ఎన్నో ఎత్తులకెదిగిన మనిషి. ఆచార్య చెన్నప్పగారి లేఖిని నుండి వెలువడిన శోకకావ్యం ప్రమీలాత్రిశతి. సహృదయుల హృదయాలలో నిలిచే రసార్ద్రకావ్యం!

'కామితార్థములిచ్చి కాచెడిదానికి
వేల్పుటావనియెడిపేరు గలదు;
ఆర్తుల క్షుద్బాధ నణచెడి దానికి
అమరతరువనెడి అభిధ గలదు;

ప్రాణమొసంగి కాపాడెడిదానికి
సంజీవనియనెడి సంజ్ఞగలదు;
దుష్టులనెల్లర దునుమాడు దానికి
రామబాణమనెడి నామమలరు;

అట్టులేనీకు లోకాన నన్నపూర్ణ
వనెడి నామమ్ము సిద్ధించె నద్భుతముగ"
నీతి దప్పక నిష్ఠతో నిలిచినట్టి
మగువనేరీతి లోకమ్ము మరువగలదు! (306)

అంటారు చెన్నప్పగారు. ఆ మరపురాని మహిళామణి ప్రమీల స్మృతి కావ్యమైన "ప్రమీలా త్రిశతి"ని చదివినవారలకు గలిగే ప్రయోజనం లెస్స. అందుకే "మక్కువతో జీవింపగ నిక్కావ్యము త్రోవజూపు నింపుదలిర్పన్" అంటూ ఫలశ్రుతి చెప్పి చెన్నప్పగారు ఈ కృతిని ముగించారు. విశ్వనాథ "వేయిపడగలు"నవలను తన ధర్మపత్ని వరలక్ష్మికి అంకితమిస్తూ

"నీవొక పెద్దవెల్గువయి నీ వెలుగారిన నాదు జీవిత
వ్యావృతి యీ కవిత్వమనునట్టి విచిత్రపు నీడ పాకెనో
దేవి! యరుంధతి ప్రముఖ దివ్యమహఃపరిలీనమూర్తి! ఆ
నీ వెలుగున్ పరోక్షమయి నేటికి నీడలు పారజొచ్చెడిన్"

అన్నట్లు చెన్నప్పగారు తన ధర్మపత్ని ప్రమీలను వెలుగుగానే స్మరించారు.

విశ్వనాథ వారి మనస్సు ఏవిధంగా పరోక్షంగా వెలుగు దగ్గర స్థిర పడిందో అట్లే చెన్నప్పగారి మనస్సు,

"ఆత్మలు శాశ్వతంబులు; మహత్తర శక్తి ప్రతీకలై శరీ
రాత్మలనంగ కొన్ని సమయంబులు జీవన యాత్రజేసి తృ
ప్తాత్మలుగా గనంబడెదు; నా పిదపన్ తనువుల్ త్యజించి ము
క్తాత్మలుగా విరాజిలు నిదంతయు దేవుని లీలయే సుమా!" (304)

అనే సత్యం దగ్గర స్థిరపడింది. చెన్నప్ప కన్నీరే ఈ కావ్యం. 'వరలక్ష్మీత్రిశతి' తరువాత తెలుగు సాహిత్యంలో నిలబడే మరో ఎలిజీ 'ప్రమీలా త్రిశతి'.

24-2-2016

- డా॥ తిరునగరి

# విషాద విపంచి

తే.గీ. సరస సంభాషణమ్ము, ప్రశాంత జీవ
నానుకూల వాతావరణప్రకల్ప
నమ్ము, గురువృద్ధ సంసేవనమ్ము, భోగ
భాగ్య సముపార్జనావృత్త వర్తనమ్ము,
సార సంసార సుఖము, విస్ఫార వంశ
జన పరంపరాగత సదాచార విధి వి
ధాన నిర్వహణ క్రియా మానసమ్ము,
మహిత వేద ధర్మ కృత సంభావనమ్ము,
దైవ పూజనమ్ము, ప్రకృతి దర్శనమ్ము,
లివ్వి ఆదర్శ దంపతులిచ్చు మెచ్చి
వ్రతమువలె సల్పు సత్క్రియల్ వసుధయందు 1

ఆ.వె. అట్టివారు ధాత్రి నరుదుగాఁ గన్పింతు
రున్న వారలందు నున్నతమతి
మసలు వారు బుధుఁడు **మసనచెన్నప్ప** యు
వారి సతి **ప్రమీల** భద్ర గతులు 2

తే.గీ. "పతియు సతియు సంతతియు నివాసగృహము
బంధుమిత్రులు పశువులు భాగ్యతతులు
మొగి ఋణాను బంధమ్మవ్వి తగిలినట్లు
తోచుఁ గాని స్థిరము కాదు, దుఃఖ మందఁ
దగదు వీడిపోవగ నవ్వి, తాను గూడ
నటులె యనియెంచి విజ్ఞాని యలరవలయు"
నను గృహస్థసద్ధర్మమ్ము వినిన వాఁడు
విడిచిపోయిన వారల విరివికీర్తి
ధరణి నిల్పంగ వితత సద్ధర్మబుద్ధి 3
మంచి పనులను జేయ సమ్మాన్యుఁడగును

సీ॥ ఒకఁడు తన చెలి లలికి గుర్తుగాఁ దాజు
మహలును నిర్మించె మమత మెఱయ,
ఒకఁడు తన చెలి లలికి గుర్తుగా భాగ్య
నగరమ్ము నిర్మించె నవక మెసఁగ,
ఒకఁడు తన చెలి లలికి గుర్తుగా నొక్క
కోవెల నిర్మించెఁగూర్మి మెఱయ,
ఒకఁడు తన చెలి లలికి గుర్తుగాఁ బెద్ద
చెఱువును ద్రవ్వించెఁ జెలువ మెసఁగ

తే.గీ. రసను గొందఱు భార్యానురాగమూర్తు
లగుచు వారి పేరున నిట్టులన్నదాన
సత్త్రములను విద్యాపాఠశాలలఁదగు
రీతి వెలయించు చున్నారు తృప్తిమెఱయ. 4

కం॥ అటువంటి దివ్య భావ
స్ఫుట ఘటిత ప్రకటనమతి శోధించి రస
స్ఫుట కావ్య మద్ది సతికిన్
దిటవగు కీర్తి నొసఁగునని స్థిరచిత్తుండై 5

చం॥ గీతను గీత భావమును గృష్ణమనోహర చిత్తవృత్తులన్
బూత మనోజ్ఞ భావమునఁ బొందికగాఁ గ్రమశిక్షణ స్థితిన్
బోతన పద్ధతిం జదివి పూజ్యుఁడు చెన్నప పండితుండు తా
నూతనరీతి భార్యను గుణోన్నత చిత్తను శాశ్వతార్థఖ
ద్యోత విరాజ మాన రుచిరోజ్జ్వల తారకవోలె రాజిలన్
జేత మెలర్పఁ గావ్యము రచించెఁ దలోదరిసేవ లెన్నుచున్. 6

మం.ద్వి. కమనీయ రమణీయ కావ్యమ్ము నందు
భర్తృ పదమ్ము శుభాంగి భార్యార్థ
పదములెతిఁగించె, వారి సంసార
జీవన యాత్రా విశేషస్థ ఘటన
లనుదెల్పె, మొగి వారల యనురాగాధి

భోగభాగ్యమ్ములన్ బొదుపు పద్ధతులఁ
దమమనోభావ విధానమ్ముఁ దన స
తీకృతాద్భుత సేవఁ దెలిపె సంతృప్తి.

తే.గీ. వనజజుడు జిహ్వా భాగమ్ము వాణికిచ్చె
కమల వదనుండు హృదయమ్ము కమలకిచ్చె
గరళగళు డర్ధ దేహమ్ము గౌరికిచ్చె
తనదు సర్వమ్ము **చెన్నప్ప** తరుణికిచ్చె. 8

తే.గీ. **మసనచెన్నప్ప** హృదయ సామ్రాజ్యరాజ్ఞి
భద్ర ధీరాజ్ఞి, వాగ్రాజ్ఞి, భావరాజ్ఞి
స్వస్థతాభోగ జీవన భాగ్యరాజ్ఞి
'భార్య' పద ధారణోత్తమ వంశరాజ్ఞి
**శ్రీమతి ప్రమీల** విమల ప్రేమ రాజ్ఞి. 9

చం॥ గతమున నీమె యే వ్రతము గాఢ తపంబిడి చేసెనోకదా!
యితఁడును జిత్తమూని మఱియెట్టి సమర్చన సల్పెనోకదా!
మతినిడి బ్రహ్మ వీరలను మంత్రపునీత వివాహ బంధ దం
పతులుగఁజేసె, స్తుత్యములు వాణి విలాసు విలాస కృత్యముల్. 10

చం॥ ఇదియొక ప్రేమకావ్యము సుహృద్య సముద్భవ శబ్దవృత్త సం
పద సదనమ్ము, సౌమ్య రస బంధుర పూత పవిత్ర భావనా
స్పదము, సతీపతి ప్రియ వచః పరిపూరిత రాగ జీవన
ప్రదకథనాను సార రుచిరార్థ నిధానము, నూత్న దంపతుల్ 11
చదువుఁడు దీని, దిద్దుఁడు లసత్సుఖ జీవన మార్గ రేఖలన్.

**– చక్రాల లక్ష్మీకాంతరాజారావు**

25-05-2016

# కృతజ్ఞతలు

నా ప్రమీలతో నాకు గల అనుబంధం నలభై సంవత్సరాలు. దాంపత్య జీవితంలోని మధుర్యాన్ని అన్నివిధాల రుచిచూపించిన యిల్లాలు ప్రమీల. ప్రతి పురుషుని అభివృద్ధి వెనుక ఒక స్త్రీ ఉంటుందన్న మాటకు ఆమె అక్షరాల ఉదాహరణ.

ఆమె నన్ను, లోకాన్ని విడిచిన తర్వాత సర్వం శూన్యమనిపించింది. బ్రతుకుమీద ఆశ సన్నగిల్లింది. కాని ఇలాంటి సమయాల్లోనే గురూపదేశం ఔషధంలా పనిచేస్తుంది. పండిత గోప దేవులను ఇంటికి రావించి నన్ను వారికి శిష్యునిగా మార్చింది నా ప్రమీలే. ఆమె అప్పుడాపనిచేయడం వల్ల ఆధ్యాత్మికంగా నన్ను నేను నిలబెట్టుకొనే ప్రయత్నం చేశాను. మనస్సును ఆత్మవిచారం వైపు మళ్లించి పరమాత్మ సాక్షాత్కారంకోసం యత్నించడమే జీవిత లక్ష్యమని భావించాను. ఉపనిషత్‌జ్ఞాన బలంతో ఆధునిక తెలుగు సాహిత్యాన్ని మెఱుగు పరిచే కార్యక్రమంలో నిమగ్నమైనాను.

ఆమె వెలుగు ఇంటి లోనేకాదు, నా గుండెలోను ఉంది. ఆ వెలుగు ఆమె స్మృతి అని వేరే చెప్పవలసిన పనిలేదు. సుమారు మూడు మాసాలలో మూడు వందల ఎనిమిది పద్యాలు ఆమె స్మృతిలో అక్షరాకృతి ధరించాయి. తత్ఫలితమే ఈ 'ప్రమీలా త్రిశతి' ఆవిర్భావం.

ఈ సందర్భంగా అమెరికా లాస్ ఏంజిల్స్‌లోని ప్రముఖ వైద్యులు డా॥ ఆలపాటి వెంకట్ గారిని గుర్తు చేసుకోక తప్పదు. ప్రమీల మమ్మల్ని విడిచివెళ్ళిన తరువాత కొన్ని రోజులకే వారు నన్ను 'నాట్స్' మహాసభలకు ఆహ్వానించి నా దుఃఖానికి అడ్డుకట్ట వేసినారు. వారికి నా కృతజ్ఞతలు.

ఈ స్మృతి కావ్యం చాలా వరకు అమెరికాలోని మా కూతురు శ్రావణి నాగరాజుల ఇంట్లో రూపు దిద్దుకొన్నదే. ఈ కావ్యంలోని "కుర్చీ కథ" యథార్థతమైంది.

నా కోరిక మేరకు ఈ స్మృతికావ్యాన్ని చదివి తమ అమూల్యమైన అభిప్రాయాలను తెలియ జేసిన సాహితీ మూర్తులకు కృతజ్ఞతలర్పించడం నా ధర్మం.

'విలాపస్మృతిగీతి – ప్రమీలా త్రిశతి' అని ఈ స్మృతికావ్యపరమార్థాన్ని తెలిపిన మా గురువర్యులు, యోగకుశలురు ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారికి నా కృతజ్ఞతలు. 'ప్రమీలా ప్రవిమలాక్షరభవనం' అని పీఠికాప్రాయమైన అభిప్రాయంతో నాకు మనోధైర్యాన్ని కల్గించిన డా॥ తిరుమల శ్రీనివాసాచార్య గారికి నా కృతజ్ఞతలు. 'ఈ స్మృతి ఒక ఆరని జ్యోతి' అని నాలో ఆత్మ విశ్వాసాన్ని పెంచిన సౌజన్యమూర్తి ఆచార్య టి. గౌరీశంకర్‌గారికి, 'చెన్నప్ప కన్నీరే ఈ కావ్యం' అంటూ నా కన్నీటిని తుడవడానికి ప్రయత్నించిన కవివర్యులు డా॥తిరునగరి గారికి నా కృతజ్ఞతలు. ఈ స్మృతి కావ్యాన్ని అములాగ్రం పరిశీలించి తగిన సూచనలిచ్చి నా కోసం "విషాద విపంచి"ని మ్రోగించిన విద్వాన్ చక్రాల లక్ష్మీకాంతరాజారావు గారికి నా కృతజ్ఞతలు. ఈ స్మృతి కావ్యంలోని పద్యాలను మొదటిసారి విని కంటతడిపెట్టిన మా ప్రియ శిష్యుడు సిరిపంగి మహేశ్వర్ వారి సతీమణి శ్రీమతి ప్రతిమగార్లకు, నా చిన్నప్పటి గురువు శ్రీ అడపాల నరసింహారెడ్డి వారి సతీమణి భారతిగార్లకు, మా బంధువులు శ్రీ డి. విజయకుమార్ వారి సతీమణి డా॥ స్నేహప్రభ గార్లకు, నా శిష్యురాలు ఆచార్య సూర్యా ధనంజయ్ గారికి, కవయిత్రి డా॥ నీహారిణి గారికి, కవిమిత్రులు శ్రీ కన్నోజు లక్ష్మీకాంతం గారికి, శ్రీ నియోగి గారికి, శ్రీ మెఱుగు వెంకటదాసు గారికి, మా పరిశోధక విద్యార్థులు మసన రామనాథం, డా॥ బి.జగన్నాథం, డా॥ ఎస్. విజయ్‌కుమార్, కె. రవి కుమార్, జి. పరమేశ్వర్, వై. సత్యనారాయణ గార్లకు నా కృతజ్ఞతలు.

ప్రమీలను, నన్నూ ఎంతో గౌరవించి, ఆదరించే 'మోక్షం' పత్రిక సంపాదకులు శ్రీమతి వి. మమత, శ్రీ వి.వి.కె. చక్రవర్తి దంపతులకు నా కృతజ్ఞతలు.

ఈ స్మృతి కావ్యాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన మౌనికా గ్రాఫిక్స్ అధినేత మా బావమరిది ఆర్. సంతోష్ కుమార్, సోదరి శ్రీమతి ఆర్. పద్మజ గార్లకు నా కృతజ్ఞతలు.

**– రచయిత**

# ప్రమీలా త్రిశతి

అర్ధాంగివనుమాట అర్ధసత్యమె గాని
పూర్ణాంగి వనుటయే పొసగు నాకు
ఇల్లాలివనుమాట ఇంతంతయే గాని
యింటిదేవతవన నెలమి నాకు
గేస్తురాలనుమాట కేవలంబౌ గాని
గృహలక్ష్మివన్నచో గెలుపు నాకు
ప్రేయసియనుమాట ప్రియమైనదే గాని
సహధర్మచరియన్న చాలు నాకు

రాణివా? నీవు మద్గృహరాజ్ఞి వీవు
ఇంతివా? నీవు నా నేత్ర కాంతి వీవు
వధువువా? నీవు జీవన మధువు వీవు
పత్నివా? ఓ ప్రమీల నా ప్రాణమీవు! 1

ఎన్ని పున్నమల వెలుగీవున్నచోట?
ఎన్ని యమృతవాహినులు కన్సన్నలందు?
ఎన్ని యింద్రధనుస్సు?లింకెన్ని సొబగు?
లో ప్రమీల! నీవు వసించుచున్నచోట! 2

కన్నోజు చేసిన కాసుల పేరును
　　ధరియింపకుండనే తరలినావు
ప్రణవకుమారుని పాప పుట్టినరోజు
　　జరుపకుండనె దివికరిగినావు
కస్తూరి పెళ్లిని కళ్లార జూచుట
　　కంటెను ముందుగా కదలినావు
ఆనందభవన గ్రంథాలయమ్మింటిలో
　　విలసిల్లుటకు ముందె వెడలినావు

ఎన్ని సద్గుణంబులను ధరించినావొ!
ఎంత స్థైర్యము నీవు వహించినావొ!
ప్రేమతో మమ్ము సంతోషపెట్టినావొ!
వర్ణనము సేయగా నాకు వశము గాదు. 3

ఆత్మ శాశ్వతమన్న వేదాంత సూక్తి
అర్థమైనది; కనుక ఆయాస పడక
దేహమును వీడిపోతివి; దిశలు తేజ
రిల్ల, మా హృదయంబులు తల్లడిల్ల. 4

పదవి విరమించి, క్షేత్రముల్ పర్యటించ
వచ్చునని బల్క నను నీవు మెచ్చినావు
దేవి! యొకదానివే దూర దేశములకు
తిరిగి రాకుండ వెడలిపోతివి గదేమి! 5

ఉత్తరాయణమ్మందు నీ యుత్క్రమణము
నమ్మ శక్యమ్ము గానిది; నన్ను విడిచి
సూర్య చంద్రాది లోకాలు చూడ గోరి
పరుగు దీసితివో యేమొ పరమ సాధ్వి! 6

అకట నక్షత్రమాలిక యనగ నేను
నిర్వదేడు గ్రంథాలు రచించినాను;
గౌరవంబయ్యె సాహితీ గగనమందు
నిరువదెనిమిదో తారగా నీవు నిలువ. 7

నిన్ను నన్ను బ్రహ్మ నిజముగా ముడివేసె
మనుజ జన్మమిచ్చి మంచిగానె;
యేమి చిత్రము దరికేగెను నా కంటె
నీవ యెక్కి నట్టి నావ, ముందు! 8

పూర్ణచంద్రుండ నీవు నా పొంత నున్న
అర్ధచంద్రుండనైతి నీ యండ లేక;
సుదతి! యేవంక లేకుండ శూన్యమందు
పరుగు దీయంగ నెట్టులో నెరుగకుంటి. 9

ఎక్కడి కేగినావొ! నిను నింక గనుంగొన నెట్లు గల్గునో?
చక్కని గేస్తురాలవని చాల ప్రసన్నత నొందుచుందు; నా
ప్రక్కన నీవు లేనియెడలన్ మరి గౌరవ మెట్టులబ్బు? హా!
చిక్కితి వెట్లు మిత్తికిని? చిహ్నములేమి యెఱుంగనైతినే! 10

గుండెలోన దాచుకొన్న దానవు నన్ను
సహన శక్తి నాకు సడలకుండ;
గుండె ఆగెనన్న గుండె గుభిల్లనె
నాతి లేక గుండె కోత గాదె! 11

కుండిలోని మొక్క యెండిపోయినదంచు
నపనయించు నన్నునాపినావు
కాని నిన్ను నేను కాల పాశమునుండి
యాపలేక పోతినకట దేవి! 12

ఇంక మీదట మొక్కల కెవరు వచ్చి
నీరువోయంగ జూతురు? నిజము సెప్పు
ఒక్క మొక్కయు నా ప్రమీలున్న కాల
మందు చిన్న బోవుట తెలియంగనైతి. 13

నలుబదేండ్లకు ముందర నాదు గృహము
పావనము సేయ వచ్చిన పరమ సాధ్వి!
సభ్యులెక్కువైరింకేల చాలునంచు
నిష్క్రమింపంగ జూచితే నిలువ లేక? 14

చిన్న మనుమరాలి చిన్మయ రూపాన
నిన్ను చూచికొనగ, నిమ్మళముగ
సాగిపోతివేమి? సంశయ మ్మియ్యది
నన్ను బాధ పెట్టుచున్నదమ్మ! 15

బ్యాంకులో ఖాత తెరువంగ వలయునంచు
పెక్కు సార్లు ప్రయత్నించి విఫలమైతి;
"అంత నీయది; నాది లే"దనుచు పలుకు
పలుకు లెల్లను నిజమయ్యె పడతి నేడు! 16

అమ్మ నాన్నలు నిన్ను నా కప్పగించి
చాల మేలు ఘటించిరి; సత్య మెఱిగి
వైభవమ్ముగ నలుబది వత్సరాలు
దివ్య పథమున నను ప్రచోదించినావు. 17

ఇతరుల కెట్టి బాధ కలిగించుట కిష్టములేని దానివై
సుతుడు వసించు గేహమును జొచ్చి దినద్వయమున్న దానవో
స్తుతమతి! యెంత ప్రేమగలదో యెఱుగన్ భవదీయ మాత్రకై
హితమొనరింపగా జనితి, వేగితి వక్కట దివ్యలోకముల్! 18

వ్రాలి పోయిన మొక్కను వ్రాల నీక
చక్కగా నిలబెట్టిన సాధ్వి వీవు;
నీవు వ్రాసిన కతమున నిలువలేని
నన్ను నిలుపంగ జూచెడి నాతి యెవరు? 19

కనులు నీ కోసమై చూచు కాంక్ష మీర!
మనసు నీ జ్ఞాపకాలలో మునిగిపోవు
సత్యపథమున నడిచిన సాధుమూర్తి!
ధ్యేయమైనావు గద నాకు దేవదేవి! 20

పదవి కెక్కినది మొదలు పదవి దిగెడి
దాక నాకు తోడుగనున్న దానవమ్మ!
నలుబదేడుల సేవలో నాకు జూడ
శతవసంతాల సౌఖ్యంబు సాధ్యమయ్యె! 2

ఒకమాటలో నైన నొక తప్పు దొర్లదు
తలపంగ లేదొక తప్పటడుగు;
ఒక యూహలోనైన నొక లోపముండదు
కాసువీసములన్న కాంక్ష లేదు;
పదిమందిలో నున్న, ప్రత్యేకముగ నున్న
నాత్మీయతయె గాని యహము లేదు;
సాటివారేనియు, సరిలేనివారేని
బంధుత్వమున భంగపాటు లేదు

ఎంత మంది మహిళ లింటికేతెంచినన్
పసుపుబొట్టొసంగి పాదములకు
వందనములు చేసి వర్తిల్లు నా దేవి
నల్వదేండ్లు గడవ నన్ను బాసె. 22

తప్పు జేసినాను తలపంగ నీ యందు
కాని యెడల పదవి లేని యపుడె
నీవు విడిచిపోవ నిజముగా దుఃఖమ్ము
దరికి జేరు టెట్లు ధర్మపత్ని? 23

సత్యమునకు దూరంబుగా జరిగినాను
కాని యెడల నీ వెందుకు కానరాని
లోకముల కేగదలతువు? లోభముననె
బ్రతికి యున్నాను నిను వీడి పరమసాధ్వి! 24

తప్పిదమ్ములు జనులకు తప్పవేని
తప్పకుండెడుగాక! యా తప్పులెపుడు
ధర్మ పత్నులయెడ పతుల్ దలపరాదు;
తలచినన్ బహు కష్టముల్ దప్పకుండు. 25

ఇది సేయవలెనని యది సేయవలెనని
కోడళ్ల నెప్పుడు కోరవమ్మ!
అక్కడికిక్కడికంచు కుమారుల
కప్పగించి పనులు తిప్పవమ్మ!
పనిలేని పనులకు; సినిమాల కెప్పుడు
పెద్దగా బలవంత పెట్టవమ్మ!
'ఊఁ' అంటె పుట్టింటి కుఱుకంగ వలెనని
యేనాడు చొరవ చే బూనవమ్మ!

ఓ ప్రమీల! నిన్ను నుత్తమ గుణములు
చేర్చి సృష్టి కర్త చేసినాడు;
భార్యవగుచు నాకు భాగ్యవశంబున 26
నింపినావు బ్రతుకు నిండ వెలుగు!

సౌరభములేల పంచు పుష్పవ్రజంబు?
చంద్రికల నేల వెదజల్లు చందమామ?
ఏల సలిలంబు పారు? గాడ్పేల విసరు?
ఏల ప్రేమించు మనసు ప్రమీల నిన్ను? 27

సుదతీ! యెన్నడు రోడ్డుపైన జననంచుం జెప్పదే కారు? నీ
పదముల్ మోపిన జాలు వేగమలరన్ పర్వెత్తగా జూచు; నీ
పదహారేడులు కారు పైనమలరెన్ ప్రావీణ్య మొప్పారగా;
పదిలంబిప్పటి దాక, నా బ్రతుకు నిన్ బాయంగ నెట్లుండునో? 28

మిత్రులేగుదెంచి మేలైన విషయాలు
మాటలాడుచుండ మన గృహాన
వాదులాడు మమ్ము వదిలేసి చేతువు
మాటలోన మాకు మంచి వంట! 29

పాప తల్లిపై ఆధారపడిన యట్లు
పంట వానపై ఆధారపడిన విధము
పలుకు గురువుపై ఆధారపడిన రీతి
పడతి నీపైన ఆధారపడిన వాణ్ణి! 30

నీకు నాకును తొమ్మిది నెలల తేడ
చదువులో నిరువురకును చాల తేడ
రంగు లోపల బంగారు రంగు నీది
బంధ మెట్టుల గలిగెనో బ్రహ్మకెఱుక! 31

చిన్న చిన్న తగవు లెన్నడైనను గాని
యుండవచ్చు, పెద్ద గుండ వెపుడు;
తెలిసికొంటి నేను తెలివితో నీవెట్లు
నడిపినావొ నన్ను నలుబదేండ్లు! 32

నలుబదేండ్ల జీవనంబులో నొకసారి
జలుబు చేసినట్లు పలుకలేదు;
ఆసుపత్రి కేగనటువంటి నీ వెట్టు
లందులోనె గుండెనాపినావు? 33

అవలోకించిన చాలు నిన్నడుగరే యారోగ్యముం గూర్చియున్
వివరంబొప్పగ ప్రేమతోడుత నినున్ వీక్షింపరే యెంతయున్
భవదీయంబగు మాటతీరు చెవికింబర్వంబు గూర్పంగ మా
నవతామూర్తిగ నిల్చిపోయితివి డెందానన్ ప్రమీలా సతీ! 34

పడకటింటిలో నిలువు దర్పణము నొకటి
కొడుకు చేతను పెట్టించుకొంటివీవు;
చిత్రమదియేమిటో గాని స్నేహమలర
నిలిచినంతనె గనిపించు నీదు ముఖము! 35

ఒకరి కష్టాలు చూచి తానోర్వలేదు
చేతనైనంత సాయమ్ము సేయుచుండు;
పరుల సంతోషమున పాలు పంచుకొనెడి
పడతినొసగిన దేవుని ప్రస్తుతింతు. 36

మదునాపురంబులో మనయూరి జాతర
యేటేట జరుగంగ తృప్తితోడ
కారులో మనమంత నేరుగా పయనించి
నరసింహసామికి నతులొనర్చి
జాతరంతయు జుట్టి, జనుల బాగోగులు
శ్రద్ధతో బరికించి, సంతసముగ
పేదవారికి పంచి పెడుదుము రూపాయ
లెన్నియో నిరువురమెలమి తోడ;

అకట! ఏప్రియల్ మాసాన నంచితముగ
అన్న, వదినయు నీవు, నేనచటికేగి
వచ్చితిమి; నెలలోపల భ్రాత మరియు
నీవు విడిపోవ నేగతి నిలువ గలను?

అంబయింటిలోపలి పెళ్లి సంబరముల
కంతరాయమ్ము కలుగరాదని ప్రమీల
కన్న తల్లికి ప్రాణమ్ము గావు పెట్టి
తాను దివికేగినది యెంత ధన్యజీవి!

వేళకెవ్వరైన వేడ్కతోనింటికి
వచ్చిరేని బువ్వ వండి పెట్టి
వందమందికైన వైభవంబుగ తృప్తి
నొసగునట్టి తల్లివో ప్రమీల!

కడగి క్రాంతిప్రణవులకుంగరుణ తోడ
గోపదేవుల రప్పించి గొప్పగాను
వడుగు జేయించి, దుఃఖాన వణికినావు
కళ్లలో నుండి బాష్పముల్ కారుచుండ! 40

తోడు నీడవగుచు తొయ్యలి వీవుండ
చిక్కలేదు బాధ కొక్కనాడు;
నీవు పోయినంత నిజమయ్యె నా స్థితి
నేల క్రుంగి, నింగి కూలినట్లు! 41

అడుగక ముందె నాకొసగి యప్పుడె గైకొనినావ! యైన న
న్నిడుమల పాలు చేసినటు లెంచను; పూర్వము చేసినట్టి యా
గడములు దుఃఖ రూపమున గ్రమ్మర వచ్చిన వేమి? దేవ! నీ
యడుగుల చెంత నిల్చునటులంచిత భాగ్యము గల్గజేయవా? 42

గృహిణి యను మాటకర్థమ్ము కేలుబట్టి
నడుచు సమయాన దెలియదు; నలుబదేండ్ల
సాహచర్యమ్ములోపల సతిగ నిలిచి 43
తెలిపినావు గదా నాకు దేవదేవి!

కోరినట్లు నీకు కోడళ్లు రాగానె
కన్న బిడ్డలట్లు గాంచినావు;
నాకు భయములేదు; నాకోసమైవారు 44
బాగ చూచికొన్న భద్రమగును.

వెలుగు నింగి నుండి వేరైనయట్టుల
కలువ కొలను నుండి తొలగినట్లు
పాట పికము నుండి పారిపోయినయట్లు
కోమలాంగి! దాటు కొంటి వేమి? 45

మృత్యువెట్లు వచ్చి మెచ్చెనోగద నిన్ను
స్వాగతంబు నీయ జాలినావు!
చింతవంత లేక చిన్మయరూపివై
సాగిపోయినావు జగము విడిచి. 46

ఆత్మ శాశ్వతమని యప్పుడప్పుడు పల్క
నదియు నిజము చేసి యరిగినావు;
పంచభూతములకు పంచితివా నీదు
కాయమెపుడు నిజము కాదటంచు! 47

వానప్రస్థము పూర్తిగాకమునుపే వారేవ! సన్యాసినై
'జ్ఞానాన్ముక్తి' యనంగ, సంతత తపఃస్వాధ్యాయ సంశీలినై
నీనా భేదము లేని సుందర జగన్నిర్మాణ సంవర్ధినై
ధ్యానంబందున నిల్చి ధ్యేయమును సంధానింతు నేనాత్మతో. 48

విశ్వవిద్యాలయంబులో విద్య గఱచు
నాదు విద్యార్థిలోకానికేది దిక్కు?
"ఇంతి నీ చేతి ముద్ద పీహెచ్.డి యంత"
యనగ వింటిని పలుమారులతిశయముగ! 49




అతిథులన ప్రమీల కత్యంత గౌరవ
మింటికేను బిలువనేమి యనదు;
ఓగిరమ్ము కూర్చి యున్నంతలో తృప్తి
నందజేయునట్టి అన్నపూర్ణ! 50

పోయినటువంటి వారితో పోము గాని
బాధపడకుండనేరీతి బ్రతుకగలము?
సృష్టి యనునది నరకాన శిరమునెత్తి
స్వర్గమున చేతులెత్తేసి సాగు నేమొ! 51

ఆకు ఆకున నీ సుందరాననంబె
పూవు పూవున దరహాస పూర్ణమసుడె
రెమ్మ రెమ్మన నీ పల్కు కమ్మదనమె
ఉవిద! పెరటిలో మొక్కవై ఉండరాద? 52

యోగశాస్త్రమ్ము చదువంగనో ప్రమీల!
గౌరవంబుగ రాజ యోగంబు దక్కె;
నిపుడు నీవియోగముచేత నీశ్వరుండు
వడిగ సన్యాసయోగంబు బడయ జేసె. 53

ఎంత వేదాంతియైన స్వకాంత బాసి
బ్రహ్మమందున సుఖమును బడయగలడె?
పక్షి గూటికి దూరమై బయలునందు
సుఖము నొందంగ సాధ్యమే సుంతయైన? 54





అతడు సృష్టి కర్త, యంతటికిని భర్త
అతడు భూతకోటి కన్నదాత
అతడు మృత్యురూపి, యతడమృతంబగు
అతని ముదల దాట నర్హమగునె?

ఇంత తొందరగ ప్రమీల యేగదలచి
యించు కేనియు నాకెఱిగించ లేదు;
చెప్పకను బోయెనను బాధ తప్పదయ్యె;
చెప్పిపోయిన బాగుండు చెన్నకేశ! 5

చేయవలసిన పనులెల్ల జేసి చేసి
అలసి విశ్రాంతి కోసమై అమరపురికి
వెడలినావేమొ నాకింక వివరముగను
చెప్పజాలవ! ముందు నే జేయు పనులు? 57

ఎండ మృత్యువు రూపాన నెగసి వచ్చి
నిన్ను కబళించుకొని పోయె నీరజాక్షి!
మందుటెండేగ వెనువెంట మంచివాన
కదలి వచ్చెను; నీ జాడ కాన రాదె! 58

ఎన్నిసార్లు వేంకటేశుని సన్నిధి
చేర లేదు మనము చెలిమి తోడ?
వెళ్లినన్ని సార్లు వేగంగ వచ్చితి;
మేగినావు దూర మిపుడదేల? 59



బావ వెడల, అక్క బాగుకై తపియించి
నీరసించినావు నీవు మిగుల;
అంతలోనె అమ్మ ఆరోగ్యము చెడంగ
బడసినట్టి బాధ బ్రహ్మ కెఱుక! 60

బంధు జనులు నిన్ను బాగుగా జూచిరి
యుత్తమ సతివంచు ఓ ప్రమీల!
కాని నీవు నాకు కనిపించనప్పుడు
లక్షలుండి యేమి లాభమగును? 61

ఇరువదేడు నక్షత్రాల నిష్టపడిన
నభ్రమింకొకక దానికి యాశపడెనొ?
లేనిచో నాప్రమీలను లిప్తకాల
మందు తానేల నానుండి యపహరించు? 62

తెల్లవారంగ బూచిన మల్లెపూవు
దినము మధ్యమునను సువాసనలు నింపి
సంధ్యవేళకు ముఖమును చాటు చేయు
నట్లు మన జీవితము గాననయ్యె నాకు! 63

నలుబదేండ్లుగ నాతోడ నడచినావు
చెప్పినటువంటి పనులెల్ల జేసినావు
అరవదేండ్లకే నీవింక అలసిపోయి
తనువు చాలించి నావేమి ధర్మపత్ని? 64

ఎన్నడైన నన్ను వెన్నంటి యుంటివి
కాని నేడు నన్ను కాదటంచు
సాగిపోయినావు స్వర్గమ్ము చూడగా
పిలుపు వచ్చెనేమి చెలి ప్రమీల!

కలిమి శాశ్వతంబు గాదను మాటను
మరల నాకు చెప్పి మరలినావొ?
లేని యెడల నన్ను దీనునిగా జేసి
యేల వెడలు దాన వీవిధాన?

ఈ తనువు నాది గాదని యీవు వోవ
నెంచి నట్టుల భావింతు నిపుడు నేను;
కాకపోయిన నీవేల కష్టమనక
దేహమందున నుండవు దేవదేవి?

పూర్తిగాని పనులు పుడమిలో గలవని
నమ్ము చున్న వాణ్ణి; నాతి నీవు
పోయినంత నాకు పూల పాన్పేనియు
కంటక సదృశమయి గానిపించె;

నీవు తోడు నిలువ నిష్ఠతో పనులెల్ల
జరుపు కొన్నవాడ సమయమునకు;
కష్టమెంత గలిగె కాంత! నీవేగంగ
నుత్సహించి చేయ నొక్కపనియు.

ఇంతకాలము నన్ను భరించినావు
బంధు జనముల సంతోష పరచినావు
సుదతి! యొకనాడు ఆస్పత్రి సూడబోవు
మృత్యువేరీతి నిన్ను హరించెనమ్మ? 70

ఎన్నడేనియు నాస్పత్రి కేగలేదు
సూది దీయించు కొన్నట్టి యాది లేదు;
ఎంత ఆరోగ్యముగ నుంటి! విట్టులేల
జరిగెనోగద! యీశుని కరుణ యేమొ! 71

అమ్మకు నీవె ప్రాణమయి యాదరముంగనబర్చినావు; మీ
యమ్మను జూడగా హృదయ మందున గోరుచు నాసుపత్రికిన్
రమ్మనగానె పోయితివి; రక్కసి మృత్యువు నీదు రాకకై
యిమ్ముగ రెండురోజులటనే పడిగాపులు గాచె నయ్యొయో! 72

ఎంతొ గొప్పదానవీవని చెప్పంగ
మనసు పొంగిపోవు; మరల మరల
నిన్ను స్మృతికి దెచ్చు నీ సుగుణమ్ములు;
ఓ ప్రమీల! యెక్కడుంటివమ్మ? 73

రాతి భవనాన నీవుండ, ప్రక్కనున్న
రేకులింటిలో నేనుంటి లేమిచేత;
భాగ్యవశమున నిన్ను చేపట్టినంత
బౌద్ధనగరాన గట్టితి భవన మొకటి. 74

నిజముగా నద్ది కవులు వర్ణింపదగిన
భవనమేమియుగాదు; నా పత్నివైన
నీకు కొద్ది తృప్తిని గూర్చు రేకుటిల్లు!
పేదకవి కింతకన్న నింకేది దిక్కు?

బ్రహ్మసేయు పనులు బ్రహ్మాండముగ నుండు
నందులో విచిత్ర మసలు లేదు;
నిన్ను నన్ను గూర్చి నిక్కంపు దాంపత్య
వాసమనుభవింప జేసెనతడు!

'సామి' యనగ బంధుజనములో శ్రేష్ఠుండు
నిన్ను జూపినాడు; నిజము సెప్ప
చూచినప్పుడేమి తోచకపోయెను
కాని పెళ్లియయ్యె గౌరవముగ.

ఇల్లు గొప్పదయ్యె నిల్లాలివగుటచే
మనసు గొప్పదయ్యె మాటవల్ల
బస్తి గొప్పదయ్యె పడతి! నీ వల్లనే
పేరు గొప్పదయ్యె ప్రేమవల్ల!

పూర్వ జన్మమందు పుణ్యంబు సేసిన
యట్టి కారణమున నాలువైతి
వెటులవోయినావొ? యిటుల నొంటరినైతి;
నింక జీవితానవెట్లు గెలుతు?

వధువు గొనివచ్చి తనయింట వరుడు పెళ్లి
యాడు పూర్వపు పద్ధతి నధిగమించి
బంధువులతోడ నేవచ్చి పట్నమందు
పరిణయంబాడినాడనో పడతి నిన్ను! 80

అన్నలిద్దరు, మరియు మాయమ్మ నాన్న
లిష్ట పడినప్డు, నా యిష్ట మేమటంచు
కట్నకానుక లన్నచో కాంక్ష విడిచి
పెళ్లి చేసికొంటిని నిన్ను ప్రేమతోడ. 81

పల్లెటూరివాడు, పట్నపు పిల్లతో
నెటులనడుచు కొనునొ యేమొ! యనగ,
మాటలాడు వారి మనసులు మెచ్చంగ
నిలిచితిమి ప్రమీల నీవు నేను; 82

ఎడ్లబండి మీది కెక్కించి పంపగా
అక్క పల్లెటూరి కరిగినావు;
నలుబదేండ్ల క్రింద నడిచిన దారినే
చూడగలము నేడు చోద్యముగను! 83

బండి నుండి దిగుచు పట్టు దప్పుటవల్ల
జారిపడగ బంధు జనులు చూచి
జాలి జూపినపుడు చక్కగా నిలబడ్డ
నిన్ను మరచి పోను నేడు కూడ. 84

ఎక్కడో నేను జదివితి నొక్క కథను
విత్తునాటుటే మనపని; వృక్ష ఫలము
ననుభవించుట ముందున్న జనులదనుచు;
నిక్క మొనరించెను ప్రమీల! నీ చరిత్ర. 85

నీవు ననుబాసినంతనే నీదు నాదు
బంధుజనములు వచ్చిరి బాధపడుచు;
వచ్చి రాగానె హాలులో వరలు నీదు
పటము వీక్షించి కన్నీట బడిరి సాధ్వి! 86

నీదు పరలోక యాత్రను నిజమటంచు
నమ్మజాలరు కొందరు; నమ్మరేని
యెందు కిటుల జరిగెనని యెదదలందు
సంశయింతురు లెస్సగా సత్యమిద్ది! 87

జన్మములు పెక్కు గలుగుట; జన్మలందు
మనుజ జన్మము గలుగుట మనకు జూడ
నీశ్వరుని దయగాక మరేమిటగును?
మనుజ జన్మము నీ వల్ల మధురమయ్యె. 88

జన్మమన్నది లేనిచో జయము లేదు
కాయమన్నది లేక సుఖంబు లేదు
కలసి మెలసిన వారితో కాపురమ్ము
నాకమగు, లేనిచో భయంకరము సుమ్మి! 89

చెలిమి గోరెడి వారిని జేరవచ్చు
సుఖము లిచ్చెడి వారిని జూడవచ్చు
మాటలాడెడి వారితో మసలవచ్చు
మనుజ జన్మమ్ముచే గల్గు మహిమలివ్వి! 90

సుదతి! నన్ను నీవు చూచిన కాలాన
అన్ని సుఖములబ్బె నద్భుతముగ;
ఇంక నీవు లేని యే క్షణంబైనను
సుఖము నీయగలదె సుంతయైన? 91

ఎక్కడున్న దాన వెఱుగను నిను నేను
కాని నీవు నాదు కనులలోన
నిలిచినట్లు దోచు; నీ జ్ఞాపకమ్ములే
గుండె నిండి చాల గుబులు రేపు 92

నేను వేదాంత గోష్ఠిలో నిలిచి పలుక
నెంత జాగ్రత్తగా విందువేమొగాని
తిరిగి యడిగిన నాకును దివ్యమైన
యుత్తరము నిచ్చుచుండెదవో ప్రమీల! 93

ఎన్నడును నీవు దేవత వన్న స్పృహను
పొంద జాలక నేనుండి పోయినాను
గాని, నీవనాయాసముగను జగత్తు
వదలి పెట్టంగ గలిగె తద్భావమిపుడు. 94

ఎంత చిత్రమ్ము నాచేత నించుకైన
సేవ చేయించు కొనవైతి; జీవితాన
మాకు సేవలు చేసియు మా సుఖంబె
నీ సుఖంబుగ భావించి నిలిచినావు. 95

ఒక్క క్షణమైన నీ సేవ నొనర జేసి
ధన్యుడను గాక పోతిని; ధర్మపత్ని
వనెడి మాటకు గొప్పసాక్ష్యమ్ము నీవు
ఓ ప్రమీల! నీ యెడబాటు నోర్చుటెట్లు? 96

గుణములను జూడగా సత్వ గుణము గొప్ప
సత్వగుణమన నీ కెంత సమ్మతంబొ
గరిత! నినుగాంచువారికి తిరిగి చెప్ప
వలసి నట్టి యవసరము గలుగ దెపుడు! 97

నిన్ను చేపట్టి నంకనే, నేను–జీవి
తాన చేపట్టినట్టిది తప్పకుండ
ఫలము చేకూర్చినది; నాదు భాగ్యమనక
దీని నేమని పిలిచెద దేవదేవి! 98

ఈశ్వరుని సృష్టిలోపల నెంత తీపి!
స్త్రీని పురుషుని గలుపుచు స్నేహమలర
నిట్టి దాంపత్య సుఖమాతడీయకున్న
బడయగలమె జీవితపు సాఫల్యసిద్ధి! 99

ఆది దంపతులోయన బోలి నవని మించు
నట్టి విజయకుమారుస్నేహప్రభలిటు
సాగి వచ్చెదరింటికి సంధ్య వేళ
కోర్కె దైవార నీతోడ గోష్ఠి సేయ. 100

వేదనాభరితమగు జీవితమునందు
నన్ను నానందరసమున నలుబదేడు
లోలలాడించితివికద ఓ ప్రమీల!
మరతునే నిన్ను నెన్ని జన్మములకైన? 101

ఇతరుల మెప్పించు నింగితమ్మే గాని
బాధించు బుద్ధి నీపట్ల లేదు
తోటి మహిళల సంతోషపెట్టుటె గాని
పోట్లాడు బుద్ధి నీపొంత రాదు
బంధుజనులను సంపాదించుటే గాని
కాదన్న బుద్ధి నీ కడకు రాదు
సంప్రదాయము కొనసాగించుటే గాని
వద్దన్న బుద్ధి నీ వద్ద లేదు

ఓ ప్రమీల నీ కిట్టి మహోన్నతంపు
బుద్ధి యెక్కడి నుండి సంవృద్ధ మయ్యె
నాకు తెలుపంగ వత్తువా? నా మనస్సు 102
నీదు స్మృతులను విడువంగ బోదు నిజము!

వారాశిగూడలో వాసముంటిమి గదా
పాతికేండ్లు మనము పదిలముగను;
బోడుప్పలుకు వచ్చి పొందుగా పదియేండ్లు
కాపురమ్ముంటిమి గౌరవముగ;
అంతకంటెను ముందు ఆ లాలుదర్వాజ
లోనుంటిమైదేండ్లు లోటు లేక;
పెళ్లైన నాల్గేళ్లు పెద్దకష్టమనక
హాయిగున్నాము కిరాయి యింట;

ఎక్కడున్నను జూపితి వెల్ల లెఱుగ
నట్టి యాప్యాయతను మనుజాళి పైన;
కనుక నెచ్చటి వారైన గణుతిసేయ
వినిన వాడ నీ గుణములు వీనులలర! 103

మాటలాడెడు సమయాన మనసులోని
మాట యొక్కటి వింటి నీ నోటి నుండి
"ఎంత సంపద గల్గిన నేమి? విడిచి
పెట్టకను తప్పదను మాట" పెద్దమాట. 104

ఎన్నడు గాని గేహమున నెయ్యది లేదను మాట లేదు; నీ
వున్న గృహంబు స్వర్గమయి యుత్తమ మార్గములోన సౌఖ్యముల్
గ్రన్నన గూర్చె; పండితులె గట్టిగ నిన్ను ప్రశంస సేయగా
మిన్నగ నెంచినాను గద! మేలొనరించెడి బుద్ధి నీయవా? 105

సంసారమును జేయు చాకచక్యము నీకు
భగవంతుడిచ్చిన వరము గాదె;
సంభాషణము సేయు సంస్కారమును నీకు
పరమాత్ముడిచ్చిన వ్రతము గాదె;
బంధుత్వమును జేయు ప్రావీణ్యమును నీకు
సర్వేశుడిచ్చిన జాడ గాదె;
సత్కారములు సేయు సద్భావనను నీకు
విశ్వేశుడిచ్చిన వేళ గాదె;

యిట్టి గుణములు నీకిచ్చి నట్టి వాడె
నిన్ను నాకిచ్చె; నందుకే నిష్ఠబూని
యన్ని వేళల సన్నుతులంద జేతు
పరమ పురుషునికత్యంత భక్తి తోడ. 106

మనుమరాలు శ్రవిష్ఠకు మరల మరల
ముద్దు లిచ్చుచు దాని నెమ్మోమునందు
'నా ముఖంబును వీక్షించినా' నటంచు
నెన్నియో మార్లు పలుకంగ నేను వింటి. 107

వేల పుటల రచన వేడుకతో జేయు
వేళ విసుగు కోపు వీసమంత;
సమయ పాలనమున సామరస్యము నూపి 108
నన్ను గాచినట్టి నాతి వీవె.

సూర్యోదయము కంటె సుందరమ్మగు వేళ
లేదని తెలుసు, లేచెదవు గనుక;
ముగ్గు లేసిన యట్టి ముంగిలి కన్నను
పదవి లేదందు, వేసెదవు గనుక;
సంధ్యకంటెను మంచి సమయమ్ము లేదని
పలుకుచుందువు చేయగలవు గనుక;
సత్సంగముల కంటె సంతసించెడి చోటు
మృగ్యమనెదవు చేరెదవు గనుక;

ఏది మంచిదో, చెడ్డదో యెఱుగుదీవు
కారణము నిన్ను గన్నట్టి వారు చూడ
మంచి వారని చెప్పు నా మనసు కూడ;
ఓ ప్రమీల! నిన్ను మరచి యుండుటెట్లు? 109

మూడు రోజుల ముచ్చట ముదిత! నాదు
పదవి విరమణ; యిసుమంత బాధ లేదు;
తోడు గలవని లెస్స సంతోషపడితి
నొకటి నేదలపగ, దైవ మొకటి దలచె. 110

నావలె కోర్కె మీరగను నాతి పఠింపవు ధర్మ శాస్త్రముల్;
పావనమైన వేదములు భావన సేయవు; జ్ఞానదీప్తికిం
దావలమైన గ్రంథములు తాకవు; గాని యదేమి చిత్రమో
కేవలమాత్మలో నిలిపి గెల్చిన దానవు బుద్ధి నెంతయున్. 111

పిలిచిన చాలు ప్రేమ గురిపింతువు తోడుగ చేరవచ్చి; నే
నలసట యన్నశబ్దమరయన్ భవదీయ నిఘంటువందు; నిన్
తెలిసిన వారు, ముందు గురితించని వారును చూడగానె యిం
పలరగ మాటలాడెదరు హాయిగ, త్వత్సుజనత్వ మట్టిదా! 112

పుట్టిన రోజున పూలగుత్తులు తెచ్చు
శిష్యతతికి వంట జేసిపెట్టు
పుస్తకావిష్కార పుణ్యంపు వేళల
తేనీరు, బిస్కట్లు తెచ్చిపెట్టు
తగవులు దీర్పంగ తరలివచ్చెడి వారి
దుఃఖమ్ము బాపి సంతోషపెట్టు
దూర భూముల నుండి తోతెంచు వారిదౌ
యాకలి క్షణములో నణచిపెట్టు

పదవి విరమణ వేళ నా బాగు గోరి
బోధనేతర వర్గంబు పొంగిపోవ
కొడుకుచే నూత్న వస్త్రముల్ కొనగజేసి 113
వారికెల్లరకు ప్రమీల పంచిపెట్టు.

నా విలువంగురితించు కాలమరుదెంచన్ మీరు వీక్షింత్రు; సత్
పావనమైన చరిత్రయే నడుపు నీ బ్రహ్మాండమున్; దైవమే
త్రోవను జూపిన యట్టి మార్గమున సంతోషంబుతో బోదునం 114
చీవువచించిన పల్కులందు మరి యెంతే సత్యమూహించితిన్.

భర్త యన్నమాట భరియించునని దెల్పు
భార్యయనగ మరియు భావమదియె;
సతియు పతియు నొక్క సరణి యుండినను దాం
పత్యమన్నమాట సత్యమగును. 115

పెళ్లినాటి ఫోటొ పేరు కొక్కటి లేదు
సరిగ దీయు వాని జాడ లేదు;
ఐన నేమి నాదు ఆత్మలో ముద్రించి
నిల్పుకొన్న వాడ నిన్ను నేను! 116

పుట్టినూరిలోన పుట్టదాయె కరెంటు
పట్నమునకు వచ్చి వాసమున్న
నద్దెయింటిలోన నది లేకపోయెను
వీధి లైటు నాకు విశ్వమాయె! 117

ఇరువది యేండ్ల ప్రాయమున నీ కనిపించెడి లోకవృత్తమే
నెరుగను, పట్నవాసివయి యెంతయు ధైర్య మొసంగి యుండ నే
నరుదగు సౌఖ్యముం బ్రతుకునంతట బొందితి జూడనెంతయున్
గరితయె మూలమై నిలుచుగా మగవానికి జీవితంబునన్. 118

క్షణము గడవదు నీదు సంస్మరణ లేక
దినము గడవదు నీదు ప్రతీక్ష లేక
పనియు సాగదు నీదు జ్ఞాపకము లేక
కాలమేగదు నీదు సంగతియు లేక 119

దివ్యమై యలరారు దేవి! నీ మోమును
    మరల మరల చూడ మనసు గలుగు
భవ్యమై యలరారు భామ! నీ సూక్తుల
    నాలకింపగ మదినాశ గలుగు
నవ్యమై యలరారు నాతి! నీ తలపుల
    గుర్తింపవలెనన్న కోర్కె గలుగు
సవ్యమై యలరారు సాధ్వి నీ పనులెల్ల
    వీక్షింపవలెనన్న వేడ్క గలుగు

కావ్య గౌరవమ్ము గల నా కవితలెల్ల
మొదట వినిపించి నీకు ఆ పిదప వాని
నచ్చువేసి లోకానికి నందజేసి
యిప్పుడెటనుంటివో యింక నేమిసేతు? 120

ఆత్మతృప్తికోసమార్భాటమేగాని
ఆత్మకేది తృప్తి అవనిలోన?
ఆత్మను పరమాత్మ కర్పించి నీ వింక 121
పూర్ణ సుఖము నేడు పొందినావె!

దేవదేవుడు మనకిచ్చె దేహయాత్ర;
నిద్దరము యాత్ర సేయుచు నేగుచుండ
దారిలో నాగి పోతివి; ధైర్యమూని 122
యెంత దూరము నేనింక నేగవలెనొ?

మంచి తనమునందు, మంచి కార్యములందు
మంచి మాటలందు మనసునందు
కల్మషమ్ము చూపగల్గని దేవివి!
అందు వలన భార్య వైతివమ్మ! 123

నిన్ను జేసికొనగ నిశ్చితార్థంబయ్యె;
నెగ్గిభిషను గాంచు నిచ్చగలిగె;
చార్మినారు దాక  సాగి వచ్చి మనము
తిరిగివెళ్లినాము తెలియగలవె? 124

పండితుడను గావించిన ప్రతిభ నీది
కీర్తిమంతుని జేసిన కీర్తి నీది
పుత్రవంతుని జేసిన పుణ్యవతివి
ఉర్వి నను మెచ్చగా నుంటినో ప్రమీల! 125

ఇంతకాలము నిన్ను సొంతింటిలోన
వెలుగు చుండగ జూచితి; వెడలి యిప్పు
డేడ నలరారు చుంటివో యెఱుగనైతి;
పరమ సూక్ష్మమౌ నాత్మ ఓ పరమ సాధ్వి! 126

పంచభూతాలతోబాటు పంచ సూక్ష్మ
భూతములు చూడగా లేక పోయినపుడు
వాటి కంటెను సూక్ష్మమై వరలునట్టి
యాత్మ నెవ్వండు గాంచుట కర్హుడగును? 127

ప్రజలు నిన్ను జూచి పాతకాలము నాటి
అతివవనుచు మాటలాడుచుంద్రు
కాని నీవు చూప గలుగు సదాచార
మెప్పుడైన మేము తప్పగలమె? 128

పెద్దలను గౌరవించెడి ప్రేమమూర్తి!
బంధుజనులను బ్రోచెడి భాగ్యసీమ!
చిన్న పిల్లల లాలించు స్నేహశీలి!
మాతృసేవకు తపియించు మాన్య చరిత! 129

గోపదేవుని బాటనే కోరినావు
నలుబదేండ్లుగ నాతోడ నడచినావు
సత్యధర్మమ్ము వదలక సాగినావు
మంచినెంచెడి నిన్నెట్లు మరవగలను? 130

రేకులింటిలోన రేకువై యుంటివి
పిదప కప్పువేయ పిందెవైతి;
ఒక్క ఫ్లోరువేయ చక్కని కాయవై
రెండు ఫ్లోర్లు వేయ పండువైతి; 131

అత్తగారిని నేనెప్పుడైన గాని
తూలనాడిన, నను నీవు దూరకుండ
ముడుచుకొనుచుంటి వించుక మూతి; నపుడు
చిన్నగా నిన్ను మచ్చిక చేసికొందు. 132

న్యాయమెప్పుడు నను దాటనీయవమ్మ
గౌరవమ్మున నను నిల్పు కాంతవమ్మ
తల్లి తీరుగ నత్తను దలతువమ్మ
ఓ ప్రమీల! నీ బుద్ధి లోకోత్తరమ్మ! 133

నిన్ను కలసి యుండ నిండు పున్నమ నాకు
నీవు లేక యున్న నిండు సున్న;
ఎంత ధైర్యమిచ్చి యేలితివో నన్ను
అబల గావు నీవు సబలవమ్మ! 134

అతిథిజనములన్న నత్యంత గౌరవ
మందజేసినావు; సుందరముగ
గృహము నడుపు విధము కేవలమొక నీకు
తెలిసినంత మాకు తెలియరాదు. 135

అపరాధము చేసితినా?
విపరీతపు మాటలాడి విసిగించితినా?
ఉపనిషదర్థానివి; నీ
కుపమానము చెప్పజాలనో లలితాంగీ! 136

కాలమునుబట్టి కోర్కెలు గలుగుచుండు
కోర్కెలనుబట్టి సౌఖ్యముల్ కూడుచుండు;
కోర్కెలెఱుగని దానవే కోమలాంగి!
ఈశ్వరుని కృపచేత లభించినావు! 137

మంచితనము చూడ మతమాయె నీకెప్డు
సత్యవాక్కు చూడ సవనమాయె;
పిల్లల దయజూడ ప్రీతిపాత్రంబాయె
దారవగుట జన్మధన్యమాయె. 138

చదువున కెనయైన సంస్కారమబ్బెను
దాని మించు రూపధనము గలిగె
రూపవతివి నీవు; కోపంబు చూపవు
కొంటెవాడ, నేనె కోపగింతు! 139

రామకోఠిలోన రమణీయముగ బుట్టి
గౌలిపురకు వెళ్లి గౌరవముగ
నిరువదేండ్ల ప్రాయమిమ్ముగ గడవంగ
నను వివాహమాడి నావు నీవు! 140

నిన్ను పెళ్లాడు సమయాన నిజము గానె
రెండు గిన్నెలు; గ్లాసొక్కటుండునేమొ!
యెంత పేదరికమ్ము నే నెదురుకొంటి? 141
నింతి! భాగ్యమై నాకు లభించినావు.

మొదట రేకులింట ముసురు పట్టెడి వేళ
నిదుర కొంత యైన నీకు రాదు;
ఎంత ఓర్పు నీది! యేనాడు ననువీడి 142
పోనిదానివెట్లు పోతివమ్మ!

ఒక్క గదిలోనె కాపురముంటి మకట!
అప్పుడప్పుడు వచ్చు మాయమ్మ కూడ;
అతిథులకు తృప్తి గలిగించు నట్టినీవె
ఓర్పులో గొప్ప దానివి ఓ ప్రమీల! 143

మొదటి సారి చూచి మోదమ్ముతో నాకు
తగిన దానవంచు దలచినాను
ఆలసింపకుండ అమ్మ నాన్నలు మెచ్చి
పెళ్లి చేసినారు పేర్మి నిన్ను. 144

నేను దేవుని నిందించ లేను గాని
పదవి విరమణ చేసిన పండితుడను!
భార్య లేకుండ జేసిన పగిది చూడ
కష్టమేగాని సుఖమెట్లు గలుగు నాకు? 145

పెళ్లి వేళయందు ప్రేమతో నిచ్చిరి
అత్తగారు పసిడి హారమొకటి
దాని నెన్నొ సార్లు తరిగించి కరిగించి
నగలు జేసికొన్న నాతివీవు! 146

కట్నముగను వెయ్యి కడువేడ్కతోనీయ
కోఠిలోన చీర కొంటి నొకటి;
యిరువదేండ్లు దాని నినుప సందూకలో
భద్రపరచినావు భద్రమూర్తి! 147

అత్తగారి పరిశ్రమకద్ద మీవు
విలువలను పాదుకొల్పెడి విద్దె వీవు
కరుణకున్, వత్సలతకొక్క గద్దెవీవు
భర్త చెన్నప్ప చెప్పెడి పద్దె మీవు! 148

మనుమరాలి పేరు మన యింటికిని బెట్టి
బిడ్డ మీద ప్రేమ పెంచినావు
శ్రేష్ఠయన్న నీకు చెప్ప జాలని ప్రేమ!
ప్రస్తుతింప నాకు పలుకు లేవి? 149

బెంగుళూరు నుండి ప్రేమతో నా శిష్య
డేగు దెంచె; నా మహేశ్వరుండు
ఇంట వంట జేసి యెంతయో సంతృప్తి
గలుగ జేసినావుగద ప్రమీల! 150

ఎవ్వరే స్థాయి వారలో యెఱిగి యెఱిగి
తగిన విధముగ నీవు సత్కారమొసగు
గేస్తురాలవు; నీవల్ల కీర్తి వచ్చె 151
జన్మ జన్మల పుణ్య రసంబు నీవె!

కవులు, పండితులును గౌరవంబుగ మన
యింటికరుగుదేర నెలమి తోడ
నందజేసి వారి కాతిథ్యమెంతయు 152
కీర్తి బడసినట్టి గృహిణి వీవు!

ఈశ్వరుని యందు భక్తి వహించు తల్లి
దయయు, సత్యమ్ము లోనుగా దలచు తల్లి
న్యాయముగను వర్తించెడి నా ప్రమీల
పరహితంబున బరగెడి పరమసాధ్వి! 15

చేతులెత్తి మ్రొక్కు శీలంబు గల తల్లి
మాట మీద నిలుచు మాతృమూర్తి
అర్థి జనులకెల్ల అమృతంపు భాండమ్ము
పిన్నలందు గొప్ప ప్రేమమూర్తి! 154

నాదు శిష్యగణము నమ్రత జూపంగ
సొంత పిల్లలట్లు చూచినావు
'అమ్మ'యనుచు, 'మేడ' మనుచు నిన్ బిలువంగ
నెంత పొంగినానొ ఎఱుగ గలవ? 155

ఎంత కీర్తిని నీవు నాకిచ్చినావొ
ఎంత స్ఫూర్తిని నీవు నాకిచ్చినావొ
ఎంత సంపద నీవు నాకిచ్చినావొ
వర్ణనముసేయ నాకింక వశము గాదు. 156

నాకు భార్యవైతి; నాదు సంతానాని
కమ్మవైతి; పురజనమ్ములకును
పూజ్యురాలవైతి; పుణ్యంపు గనివైతి;
వో ప్రమీల! విడచి యుండగలనె? 157

ప్రణవసుతను గాంచి పరిపరి విధముల
'నాదు ముఖ'మటంచు నమ్మకముగ
బలికినావు గనుక ప్రస్తుతము 'శ్రవిష్ఠ'
ముఖములోన నీదు మూర్తి గాంతు! 158

సంసారమన్నచో ఛాలెంజిగా గొని
దిద్ది తీర్చిన యట్టి దేవివీవు
భర్తతో నెట్లు ప్రవర్తింప వలయునో
బాగుగా తెలిసిన పడతివీవు
ఇరుగు పొరుగు వారి నేతీరు చూడంగ
మంచిదో యెఱిగిన మగువవీవు
పండితులరుదెంచి ప్రవచనమ్ములు సేయ
శ్రద్ధగా విన్నట్టి సాధ్వివీవు

నాల్గు సార్లు విమాన యానంబు జేసి
అమెరికాను దర్శించిన అతివ వీవు
ఏ ప్రకారమ్ము చూచిన నో ప్రమీల! 159
నాకు నీయంత ధైర్యమ్ము నాస్తి నాస్తి.

నాకు దెలుసు పెళ్లి నాల్గవ రోజున
పరుపు దెచ్చి మామ పడెను క్రింద
అప్పుడెంత బాధ యతివ! నీకబ్బెనో 160
యిప్పటికిని నేను చెప్ప లేను.

పిల్లల పెళ్లిళ్లు వేడుకతో జేసి
సన్నుతుల్ పొందిన సాధ్వివీవు;
మనుమనితో బాటు మనుమరాళ్లను జూచి
యుప్పొంగిపోయిన యువిద వీవు;
వారాశి గూడలో పాతిక వత్సరాల్
సొంతింటిలో నున్న సుదతి వీవు;
అతిథి సత్కారంబు లందించు విషయాన
ప్రవరుని భార్యకీడవుదువీవు;

కలిమి లేములొకటిగా పరికింతువు
కలిమి కలిగెనేని గర్వపడవు
లేమియందు చింత లేశంబు చూపక
యున్నయట్టి దానవో ప్రమీల! 161

నిన్ను మోసికొనుచు నీ యన్న నాకిచ్చె
పువ్వులాంటి దనుచు పొసగ బలికి;
పడతి నీవనంగ పారిజాతానివే
మరచిపోవుటెట్లు మంచితనము? 162

మూడు రకాల కమ్మలను ముచ్చటగా ధరియించుచుంటి; వే
నాడును నీకు నచ్చినదె నమ్మకముంచుచు స్వీకరింతు; వే
కాడికి నాదు వాక్కులను కాదన లేక సమాదరింతు; వో
చేడియ! నీకు సాటిగను జీవితమందున నిల్వరెవ్వరున్. 163

అల్లమును బెల్లమును తూకమములు సేసి
తెలియ జెప్పెడి వారలే గలరు గాని
పాప పుణ్యమ్ములను వేఱుపఱచి యింత
యంత యనుచును జెప్పువారవని లేరు. 164

ఎంత పుణ్యాత్మురాలవో ఎఱుగగలను
ఎంత సౌజన్య మూర్తివో ఎఱుగగలను
ఎంత సద్గుణరాశివో ఎఱుగగలను
గాని నీ వేగు జాడనే గాననైతి. 165

నిన్ను మొదట గాంచి నేను ప్రశ్నించితి
"చదువు సంధ్యలందు చాల గొప్ప
దేది?" యనుచు; నీవు నెంతయు చదువని
చెప్పినట్టి మాట సిరుల మూట! 166

ప్రేమ చూపి 'గీత' పేరుతో నేటేట
మూడు నాళ్లు చుట్టములను బిలిచి
చక్కగా జయంతి సభలను జరిపించు
పుణ్యరాశి, వన్నపూర్ణవీవె! 167

సభలు సభలన్న అవి నీకు సభలు కావు
చుట్టముల యిండ్లు; సభలను జూడవచ్చు
వారు పల్కరించక నుండువారు కారు;
చెప్పుచుండ్రు ప్రమీల! నీగొప్పతనము. 168

నింగిలో దేవుండు నిల్చియుండును గాని
నింగికి భిన్నుడై నిలిచి యుండు
నింగిలో దేవుండు నిండియుండునుగాని
నింగికాతడు తెలియంగరాడు
నింగిలో దేవుండు తొంగి చూచును గాని
నింగినే మించి రాణించు చుండు
నింగిలో దేవుండు నిశ్చలుండగు గాని
నింగి యా దేవుని కంగమగును

నింగిలోనుండి, సర్వమున్ నియతముగను
పాలనము సేసి శాసించు పరమవిభుడె
వంట గదిలోను గలడని వరుస జెప్ప
నవ్వితివి; తత్త్వమర్థమైనది ప్రమీల! 169

ఇంత స్నేహమ్ము పంచితి వెవరు నీవు?
ఇంత సౌజన్య మిచ్చితి వెవరు నీవు?
ఇంత సత్కార మొసగితి వెవరు నీవు?
పాత పట్నంబులోని దేవతవు గావా! 170

నా సారథి, నా కోమలి
నా సేవకు తగినయట్టి నాదు ప్రమీలన్
నా సతిని, లోకపతి నా
కోసమె సృష్టించినాడు కోరిక మీరన్. 171

వేంకటేశుని దర్శింప వెడలి మనము
నాల్గు గంటలు నిల్చియున్నాము గాని
అలసిపోజాల వెంతయు నాత్మశక్తి
కరయగా నీవు దృష్టాంతమగుదువమ్మ! 172

మనుమడు సైకిలు కోరగ
కొననిద్దర మేగుదెంచి కొని రాలేదా?
గొనకొని మొన్న రిపేరై
నను జ్ఞాపకమునకు వచ్చినావు ప్రమీలా! 173

ఎంత ప్రేమ నీది? యెంత శాంతము నీది?
యెంత సజ్జనత్వ? మెంత నీతి?
యెంత సౌకుమార్య? మెంత విజ్ఞానమో?
మరపు రాదు నాదు మనసుకెపుడు. 174

ఇరువది నాలుగేళ్ల కొక యింటిని గట్టగ, తోడుపాటు నీ
వరుదుగ నా కొసంగితివి; హాయిగ జీవన యాత్ర సేయగా
గరువము హెచ్చె; పట్టణపు కన్నియవై పలెటూరివాని కా
పురమున వన్నెలద్దితివి, పూర్వము చేసిన పుణ్య మెట్టిదో! 175

'భక్తి' టీవి వారు భాగ్యనగరమున
ప్రేమతో నిరువుర బిలిచినారు
కోర్కె తోడ నాటి కోటిదీపోత్సవ
మందు గౌరవంబు నందుకొనమె! 176

పరుసులోన డబ్బు పలుకు లోపల తేనె
పనులలోన నేర్పు పరహితంబు
కనులలోన కరుణ కళ్యాణ కారక
జీవనమ్ము నీది చెప్ప నేల?

తిరుపతి దేవస్థానము
సరిగా కసిరెడ్డి యున్న సమయములోనన్
హరువొప్పగ మాట్లాడితి
గురుతున్నద నన్ను మెచ్చుకొంటివి దేవీ!

ఎన్నొ యాశ్రమంబు? లెన్నియో క్షేత్రంబు?
లెన్నొ తీర్థములు? మరెన్నొ స్థలము?
లీవువెంటరాగ నెంతయు భక్తితో
జూడ గల్గినాను సుందరాంగి! 1

కల్లలు దెలియని దానవు
పిల్లల సంక్షేమ మెఱిగి ప్రేమామృతముం
జల్లిన దానవు; నీచే
చల్లని బ్రతుకబ్బె నాకు సంసారములోన్. 18

ఎక్కడ పదములు మోపిన
నక్కడ కష్టములు దొలగి యానందముతో
చక్కగ నుందురు బంధువు;
లక్కజమగు నీదు చరిత యందరిలోనన్! 181

అమెరికాను విడిచి ఆత్మజుండరుదేర
భయము దీర్చి తగిన పనిని జెప్పి
పేరు దెచ్చినట్టి ప్రేమ నీదని చెప్ప
నుబ్బిపోవునెడద ఓ ప్రమీల! 182

నన్ను బాధించవైతి వేనాడు గూడ
కలుగ చేసితి విష్టార్థములను లెస్స
పిల్లలు స్వతంత్రులైరి నీ ప్రేమతోడ
వలసినంతగ ప్రఖ్యాతి వచ్చె నాకు! 183

పెళ్లి మొదలుగ నీ పైన ప్రేమ జూపు
అమ్మ గారింటి వైపు నీవాశపడవు;
అత్తగారింటి బరువు బాధ్యతలలోన
మునిగి తేలిన యకళంక మూర్తి వీవు! 184

కలిమి లేములందు కడదాక నొక తీరు
దనరినట్టి మేటి తరుణి వీవు;
పేదవడిన బ్రతుకు పెరటి లోపల నీవు
తులసి మొక్కవమ్మ తోయజాక్షి! 185

స్వయముగ నెవండు రాలేడు జగతి గనగ
మరలి పోవుటయును లేదు మనకు జూడ
వచ్చి పోవుట లేనప్డు వశము దప్పి
యెవరినో యింక దిట్టుచు నేడ్వ నేల? 186

ఎంత చదువు చదివి యెన్ని గ్రంథంబులు
వ్రాసినానొ నీవు ప్రక్కనుండ!
అటుల నింక వ్రాసి యగణిత కీర్తిని
పొందువాడ నేమొ పొలతి! చెపుమ. 187

ఇద్దరమొక చోట నింపుగా గూర్చొని
మాటలాడగలము మంచి చెడులు;
కష్టకాలమింక కాంత! నాకెదురాయె
పరులతోడ నెటుల పలుకగలను? 188

తిరుపతి వెళ్లగానచట దేవతవోలె వెలుంగు నిన్ను గాం
చిరి జను; లందులోన కడు చిన్న వయస్సున నున్న యట్టి వా
రిరువురు నీకు రక్షణగ నెంతయు బిల్చినయట్లు నిల్చి నా
రరుదుగ దీని నీ మహిమయంచు గణించెద నాత్మ లోపలన్! 189

ఎన్ని మార్లు కొల్కులపల్లి కేగి వచ్చి
నామొ! కనుగొని యూరి జనంబు నీవు
పల్కరించకనుండవు; పరకొ, వీస
మో నొసంగకుండవు గదా, ఓ ప్రమీల! 190

సత్యనారాయణవ్రత సంభ్రమంబు
నమెరికాలోన జూపించి నట్టి గొప్ప
గృహిణి వీవని చెప్పంగ గెలుపు నాకె;
ఓ ప్రమీల నీ మనసు మహోన్నతంబు! 191

వేదము నంతయుంజదివి వేడుక జూపెడి వాడనంచు నే
వాదము సేయ; నాంధ్రమున బ్రహ్మమెఱింగిన గోపదేవునిన్
కాదనలేక దేశికునిగా నొనరించి మరింత జ్ఞాన సం
పాదనమందు నిల్పితివి; పాయను నేనును సత్యమార్గమున్. 192

ఏమి యనుబంధమోగాని యీవు పిలువ
వచ్చి సేవలు చేయుచు, మెచ్చినట్లు
నడుచుకొనునట్టి శ్రీశైల మడలి పోయె;
నీదు నిర్గమనమునకు నిలువ లేక. 193

నీవు నా యింట పాదమ్ము నిలిపినపుడు
నాకు సంపద శూన్యమే; నమ్మకముగ
చదువు పై ప్రేమ పెంచిన సాధ్వి వీవు;
దైవ వశమున సంపద దరికి జేరె; 194

నీవు లేవను వార్త జీర్ణించుకోక
వందలుగ నభిమానులు వచ్చినారు;
సాధు వర్తనమ్మనునది సాధ్వి కెట్లు
యశము గూర్చునో నిను గనినంత దెలిసె; 195

పరుషము రాదు జిహ్వకు; తపంబది సేయని రోజుమృగ్య; మం
దరిని ప్రియంబుతో గనెడి ధార్మిక వృత్తియు నీకు గల్గె; నీ
మురిపెము లెల్ల పిల్లలకు మూటలు గట్టి యొసంగు చుండగా
మరచుట యెట్లు నిన్నకట! మన్నన సేయుదు గుండెలోపలన్! 196

నినుగొని జాతర కేగిన
ననుగని హర్షింత్రు జనము; 'నగరము నుండే
చనుదెంచినవారా తమ?'
రనుచును ప్రశ్నించుచుందు రానందముతోన్. 197

అన్నలు నీవన్న ఆప్యాయతను జూపి
ఆరోగ్యమును గూర్చి యడుగుచుంద్రు
వదినలున్ నీవన్న ముదమును జూపించి
బాగోగులను గూర్చి పలుకుచుంద్రు
కోడళ్లు నినుగాంచి కోరిక మీరంగ
క్షేమమా యనుచు ప్రశ్నించుచుంద్రు
పౌత్రులు ప్రేమతో పరికించి నీ సంచి
నెదియొ తెచ్చిందని వెదుకుచుంద్రు

నీవు గనిపించినను చాలు నిజముగానె
అందరికి నది యేమిటో అగును గాదె!
పలకరింపులతో నింటి పరిసరాలు
కొత్త రూపు సంపాదించుకొను ప్రమీల! 198

ఎంత దూరమైన నిట్లె యేతెంచుదు
నంత దూరమనుచు చింతగొనవు;
కోపమును వహించి, కోపమ్ము దెప్పించు
గుణము నీది కాదు కోమలాంగి! 199

వేదాంత విషయాలు వివరంబుగా జెప్పు
నేర్పు నీ వల్లనే నేర్వనయ్యె;
అమెరికా సభలలో నద్భుతంబుగ బల్కు
ప్రతిభ నీ వల్లనే బడయనయ్యె;
ఉపనిషత్తుల జ్ఞానముపయోగమున దెచ్చు
సరణి నీ వల్లనే సాధ్యమయ్యె;
గోపదేవునికడ కూర్చుండి చర్చించు
నలవాటు నీ వల్ల నలవియయ్యె;

ఎచటికేతెంచిననుగాని యీవు నాకు
తోడుగా నుండినందున తోడివారు
మెచ్చుకొనిరని భావింతు; మేలు గూర్చు
వారలింకేరి పత్నుల వలె ధరిత్రి? 200

వైదిక రీతిలో విద్యను బోధించు
విద్యాలయంబన్న వేడ్క నీకు
లాల్చి, పైజామను దాల్చి ప్రసంగించు
చెన్నప్ప యన్నచో చెలిమి నీకు
స్పీడు బ్రేకర్లు కన్పించని రోడ్డున
కారు ప్రయాణంబు కలిమి నీకు
కట్నములకు తావు కన్పించనటువంటి
పెళ్లి సంబరమన్న ప్రేమ నీకు

కట్టుబొట్టన్న పరహిత కార్యమన్న
చేతినిండుగ పనియన్న-స్నేహమన్న
పూల మొక్కలకును నీరు పోయుటన్న
ఇష్టమగునో ప్రమీల! నీ కిన్నినాళ్లు. 201

రెక్కలు వచ్చి, పోయిన సరేనని సమ్మతి జూపినావులే;
యెక్కడికేగినన్ మరల యింటికి వచ్చెడి వారె పుత్రకుల్
స్రుక్కగనేల యంచు నను శోకము బాయగ జేసినావుగా
నిక్కములయ్యె నేటికిని నీ వచనాలు ప్రమీల సాధ్విరో! 202

చదువు నేర్చుకొనుచు చాలకష్టంబులు
పడ్డయట్టి వాడ బాల్యమందు;
ఔను! నిను వివాహమాడిన తర్వాత
గొప్ప చదువులెల్ల కోరి వచ్చె; 203

లౌకిక విద్యకు పరిమిత
మైకాలముగడుపుచుండ నాదరమతివై
శోకము దూరము చేసెడి
నాకము వేదమ్ము చూపినావు ప్రమీలా! 204

నీవు సహకార మీయంగ నేర్పు దనరి
పాఠక జనంబు నన్నెంతొ ప్రస్తుతింప
రచన లెన్నియో జేసితి రమణి! యిల్లు
నిజము నీవల్ల భారతీ నిలయమయ్యె! 205

సుదతి వల్లనే పురుషుని స్తుతి ఘటిల్లు
లలన వల్లనే ఆరోగ్య లక్ష్మి గలుగు
ఉవిద వల్లనే సత్కీర్తి ఉద్భవించు
భార్య వల్లనే భర్తకు భాగ్య మబ్బు! 206

నీవు పెంచిన మొక్కలు నిన్నుబాసి
దీనముగ గనిపించును దిక్కు లేక;
రాజు లేకున్న లోకాన రాజ్యరమకు
ప్రజలకేరీతి సౌఖ్యంబు పరిఢవిల్లు? 207

ఎంత యద్భుతంబోగాని యిష్టమలర
కాలు మోపితి వీయింట; కానియెడల
ఉదయనగరమ్ము లోపల ఓ ప్రమీల
బోరులో నీరు చక్కగా పొసగుటెట్లు? 208

అప్పుడప్పుడు గాని నీవాడుబిడ్డ
లనిన చిరుకోపమును జూపవైతి వమ్మ!
ప్రేమతో నెల్ల వారిని పిలుచు బుద్ధి
నీకు భగవంతు డొసగెను నిశ్చయముగ! 209

నీవు వెడలినంక నీ పుస్తకంబులు
తెరచి చూడ భక్తి పెరిగిపోయె;
నన్నిటిని పఠించు నాలోచనే నీకు
నెట్టులబ్బెనొ కనిపెట్టనైతి! 210

సభలలో తోడుగా సాధ్వి! నీ వరుదెంచి
కూర్చొనుచుంటివి కూర్మిదనర;
పెళ్లిళ్లలో నీవు పెద్దముత్తైదువ
వలె సూచనలిడితి వలయకుండ;
అమ్మగారింటిలో నందరి ప్రేమను
చూరగొంటివి నీవు చోద్యముగను
అత్తింటిలో నందరడిగి తెలిసికొను
కార్యముల్ నీ వల్ల గలిగెనమ్మ!

ఇంక దివికి వెడలి యేతీరుగానుండి
కాల మొక్క తీరు గడపగలవొ?
ఒక్క క్షణము ఖాళి యుండని నీవు నా
భాగ్యవశము చేత భార్యవైతి! 211

'కాలని' లేవక ముందే
మేలుకొనుచు, గేటు దీసి, మేలగురీతిన్
నేలను శుద్ధి యొనర్చుచు
లీలగ వేయుదువు ముగ్గులే, ఓ తరుణీ! 212

నరక సదృశమైన నరలోకమును నీవు
నాకముగను జేసి నడచినావు
హితులు, బంధుజనులు స్తుతియింపగా నీవు
ధర్మమందు నిలిచి దనరినావు! 213

సాయంత్ర వేళల జరిగెడి సభలలో
వినిపించుచుంటిని వేదవాణి
సారస్వతపరిషత్ సభలందు గళమెత్తి
భాషించుచుంటి ప్రబంధములను;
బదులు, కళాశాలలడిగిన చాలును
చేరి ప్రసంగాలు చేయుచుంటి;
ఉద్యమ మొనరించు ఉస్మానియా శిష్య
బృందము నింటికి బిలుచుచుంటి;

నింటిలోపల, నీతోడ నింపు దనర
ముఖ్య విషయమ్ములను గూర్చి ముచ్చటింతు;
నింక నిలయాన నాకిప్పుడేమి సేయ
తోచకున్నది; నీవు నా తోడు లేక! 214

ఋషి దయానంద రచితమై యెసగుచుండి
శ్రేయమగునర్థమును ప్రకాశింప జేయ
గలుగునట్టి సత్యార్థ ప్రకాశ మీవు 215
కోరి నాచేత వినిపించుకొంటివమ్మ!

మూఢమైనట్టి యాచారములను విడిచి
సత్యపథమున నడిచిన సాధ్వి వీవు;
ఆర్య వనితగ రాణించి యందరికిని 216
మంచినే పంచిపెట్టిన మహిళవమ్మ!

నేను పాపమ్ము చేసితినేమొ, కాక
భువనమందుండి ననువీడి పోదువేల?
కొంచెమైనను నాసేవ కోరకుండ
మాయమైనావు తుదకు నీ మహిమ జూపి. 217

పుట్టినప్పుడు గొప్పగా పుట్టరెవరు
పోయినప్పుడు మాత్రమే పుణ్యపాప
ములను గూర్చి చర్చింతురు; ముచ్చటించు
చున్నవారమనుదినమ్ము నిన్ను దలచి; 218

చక్కనగు ప్రణాళిక కొనసాగునట్లు
నడపినావు సంసారమ్ము; నాతియన్న
నీ కరణినుండగా దగు; నియమ బద్ధ
జీవితంబున నీవు విజేతవమ్మ! 219

కలిమి లేములు రెంటిని గాంచి నీవు
సరిసమానముగా నెంచి సాగినావు
బాధపడలేదు కష్టాలు వచ్చినపుడు
పొంగిపోలేదు సౌఖ్యాలు పొందినపుడు. 220

నీకు రామాయణంబన్న నేస్తమయ్యె
నీకు భారత శ్రవణంబు నియమమయ్యె
నీకు శివపురాణంబన్న నిష్ఠయయ్యె
నీకు భాగవతంబన్న నిఖిలమయ్యె. 221

ఎంత భక్తి నీది యెల్లప్పుడోంకార
నామమును జపించినావు సుమ్మి
తరగనట్టి పుణ్యధనము సంపాదించి
వెడలినావు దివికి పుడమి నుండి! 222

నీవె వెలుగు వైతి! నీవె కలిమి వైతి!
నీవె నియమవైతి! నిష్ఠవైతి!
నీవె భక్తి వైతి! నీవె దేవతవైతి!
నీవె శక్తి వైతివే ప్రమీల! 223

ఇంటికిని రాక నొక్కడినెక్కడేని
యుండిపోయిన, నేనెక్కడుండినానొ
యేమిసేయుచునున్నానొ యెఱుగ గలవు
దివ్య దృష్టి యుండా యేమి దేవి నీకు? 224

ప్రేమ మీరగ పిల్లల బిలుచుచుండి
పెద్దలకు నమస్కారముల్ పెట్టుచుండి
యతిథిజనముల సేవలో నలరుచుండి 225
తగిన మర్యాదలను జేసి దనరినావు!

అనుభవంబులోని కరుదెంచి యీశుండు
తెలియబడునటంచు దెలిపె శ్రుతులు!
దీని నరసి నీవు దివ్యమ్ముగా నీశు 226
ధ్యానమందు మునుగుదానవమ్మ!

నీవలె పనిజేసి నీతి దప్పని తన్వి
కనిపింప లేదన్న కల్ల గాదు
నీవలె యోచించి నిజము చెప్పెడి గుమ్మ
దొరక లేదన్నచో దొసగు గాదు
నీవలె భాషించి నేర్పు చూపెడి భామ
లభ్యమ్ము గాదన్న లాతి గాదు
నీవలె వీక్షించి నిల్చియుండెడి నాతి
దరిజేర లేదన్న తప్పు గాదు

ఏ విధంబుగ నిన్ను నా కేడుగడగ
జేసెనో పరమేశుండు, స్నేహ మొప్ప
గూర్చితివి సర్వసౌఖ్యముల్; కోర్కె మీర
సత్పథమ్మున నేనింక సాగువాడ! 227

ఆత్మ నిత్యమన్న అర్ధసత్యముగాదు
నింగి శూన్యమన్న నిజము గాదు
మనిషి దేవుడన్న మర్యాదయే గాదు
నీవు నీవె యన్న నిక్క మయ్యె! 228

గొప్ప గురువు వాచస్పతి 'గుండెరావు'
పాతపట్నానికెంతయు ప్రభను గూర్చె;
అంత యెందుకు నాగరాజట జనించె;
ఓల్డు సిటి కాదు, నాకది గోల్డు సిటియె! 229

పాతపట్నమ్ములోపల బరగినట్టి
'శారదాకళాశాల'లో జదివినావు
అపర శారద 'అండక్క' యట్టిచోట
చదివి, ఆచార్య పదవిలో పదము మోపె. 230

నిన్ను పెళ్లాడినప్పుడు నిక్కమునకు
కేవలము పట్టభద్రుడ; కేలుబట్టి
నానొ లేదొ యదృష్టవశాన చెలువ!
యెన్నొ డిగ్రీలు సాధించు కొన్నవాడ. 231

కాశి జూడంగ వేడుక కలిగె మనకు
కొడుకు గొనిపోయె తనతోడ కోమలాంగి!
కాశిలోపల నొకయింత కష్టమనక
యెంత దూరమ్ము నడచితో యెఱుగలేను. 232

కాశివిశ్వేశు దర్శించి, గాఢభక్తి
నన్నపూర్ణను జూచితి వాదరముగ;
కాలభైరవ స్వామిని గాంచి నంత 233
ధ్యానమున మున్గిపోయిన దానవమ్మ!

ఏమి చిత్రమ్ము మనము కాశీశు చూచి
వచ్చినారము; కాని యా ప్రళయకాల
రుద్రుడెందుకో నీ పైన క్రుద్ధుడగుచు 234
మూడు నెలలకే నానుండి ముచ్చిలించె.

'సారనాథు'ని జూచిన సంతసమున
నెట్టులో చేతి బ్యాగు పోగొట్టు కొంటి;
దొరుకునని నీవు చెప్పంగ దొరికి పోయె
'దూబె' పరిగెత్తుకొనితెచ్చె దూరమనక. 235

బుద్ధగయకేగి నిర్మల బుద్ధి తోడ
చాల సేపుంటి బోధివృక్షంబు క్రింద;
కదలనటువంటి నీ వలె కదల నట్టి
ఆకులను జూచి మురిసిపోయాను సాధ్వి! 236

బుద్ధగయలోన మనము సంపూర్ణ భక్తి
విష్ణుపాదమ్ము గనుగొని, వేడ్కమీర
శక్తిపీఠమ్ము దర్శించి, ముక్తి కోస
మెన్ని మెట్లెక్కి దిగినామొ యెఱుక లేదు! 237

అమ్మవారిని దర్శించు ఆశతోడ
శక్తిపీఠమ్ము లోనికి సాగినాము;
మొదటి గడపను దాటియు ముందు కేగ
జాలకుంటివి; నేనును చాలునంటి! 238

కాశియాత్ర నీ తుది కోర్కెగా దలంతు
పది కిలోమీటరులు నీదు పాదములకు
నడక నొసగితి ; నాయాస పడక నీవు
నన్ను వెన్నంటి వచ్చిన నారివమ్మ! 239

అచ్చటి గంగా మాతకు
మచ్చికతో హారతిచ్చు మధురక్షణముల్
ముచ్చట గొల్పగ మనమట,
కచ్చితముగ జూచినాము కైలాసంబే! 240

బుద్ధగయలోన మేమట్లు బోధితరువు
నీడ గూర్చున్నవారము; నేను మొదట
కనులు తెఱచితి; తెఱువవు కన్నులీవు;
అర్థమైనది నాకిప్పుడట్టివేళ! 241

సృష్టి లోపల ప్రకృతి విచిత్రమైన
వేషభూషలు ధరియించి వేడ్కసూపు;
విలయమనునది మరి సమీపించెనేని
తొంటి రూపాన నిలువంగ తొందరించు; 242

కాశి యాత్ర పూర్తి కాగనే పరలోక
యాత్రకై తహతహ లాడినావు!
లేనియెడల త్రిదశులేనియు వెఱగొంద
నరుగు దెంతు వెట్టులమరపురికి? 243

బౌద్ధ భిక్షువులను జూచి 'బుద్ధగయను
ఉండి పోయిన చాల బాగుండు' ననుచు
నీవు పలికిన పలుకులు నెమరువేయు
సమయ మాసన్నమగుట యీశ్వరుని మహిమ! 245

కాశియాత్ర జేసి కాలేదు మూన్నెళ్లు
స్వర్గలోక యాత్ర సలిపినావు
యాత్ర యన్న భయమె అధికమై బాధించు
నింక గట్టి మనసు నీయవమ్మ!

ఎంత గొప్ప విషయమేనియు క్షణకాల
మందు నీకవగత మగుచునుండు;
లేనియెడల ప్రశ్న లేవనెత్తిన చాలు
భావమలరునట్లు పలుకుటెట్లు?

పసుపురంగు గులాబికి ప్రాణమిచ్చి
ముదము చూపెడి దానవు; మొక్క యొకటి
తెచ్చి యీయక పోయితి తెమ్మనంగ
ఓ ప్రమీల! నీవు బ్రతికి యుండగానె. 2

కాలము గాయము మాన్చును
కాలమె కష్టంబునాపు; కలతలు దీర్చున్
కాలమె యన్నియు గూర్చును
కాలమహిమ నీవు చూపి కదలితివమ్మా! 24

అలహాబాదును నేదలంచెదను దివ్యంబైన సద్విద్యగన్;
వెలుగొందంగల నాల్గు వేదములలో వేద్కన్ త్రయీవిద్యయే
చెలువై తోచె; త్రివేణి సంగమములో శ్రీవిష్ణుపాదోద్భవన్,
చెలి కాళింది, సరస్వతీ నదుల వీక్షింపంగ నాకెంతయున్. 250

పట్నవాసుల కుదకమ్ము భయము గూర్చు
కాని పడవ ప్రయాణమ్ము కడు సుఖంబు;
అలహాబాదునకరిగిన యవసరమున
నెంత భయమాయె నీకు బోటెక్కుమన్న! 251

కాశి చూచిన చాలును కలుగు ముక్తి
విశ్వనాథుని మ్రొక్కిన వెడలు మృత్యు;
వందుకేగద నీ వంతతొందరగను
పోయివచ్చితివా కాశిపురికి చెలియ! 252

ఇద్దరము గూడి మహాలక్ష్మి నెలమితోడ
దర్శనము జేసికొంటిమి, తన్మయత్వ
సుఖము నొందితి; మంతట జూచి నిన్ను
మాటలాడిన విధమును మరవ లేను. 253

"అమ్మ! మహాలక్ష్మి నీ దృష్టి యడుగుకొనెడి
వారిపై బడ దేమిటి? అవని నీదు
కరుణ కొకయింత నోచుకో గలుగు వార 254
లొక్క ధనవంతులే యని యూహ సేతు"

అప్పుడంటివి నాతోడ అర్థమెటిగి
"అడుగు కొన్నచో గద దేవుడన్ని యిచ్చు"
ననెడి మాటను; నేనొప్పుకొనను గాని 255
కోర్కె లేనప్పుడే బ్రహ్మ కోరియిచ్చు.

నీదు వదనమ్ము చూచిన నిండుదనము
నీదు వచనమ్ములందున నిండుదనము
నియమనిష్ఠలలోపల నిండుదనము
నిన్ను తలచిన చాలును నిండుదనము! 256

"ఎన్నో గ్రంథములల్లినారలు జనంబెంతో ప్రశంసింపగా
నిన్నేళ్లుంటిరి, వేదమంటిరి సరే, యింకేమి గావింతురో!
నన్నే వస్తువుగా గ్రహించి, తమ ప్రజ్ఞా పాటవాలొప్పగా
చెన్నౌ కావ్యము వ్రాసి యీయ"మనవా చెల్వంబు దీపింపగన్. 257

పదవీ విరమణ వేళన్
ముదమున నా తోడ నిలిచి మురిసితి వెంతో;
చదువరులె మెచ్చి నీదగు
సదమల హృదయమ్ము గూర్చి సంస్తుతి సేయన్. 258

కేవీ రమణుడు స్వయముగ
నా వీడ్కోల్ సభకు వచ్చి నన్నే మెచ్చన్
నీ వానందించితివో
దేవీ! నిన్నప్డు చూడ దివ్యంబయ్యెన్. 259

అద్భుతంబగు శుచివల్ల అగ్నివైతి!
వుజ్జ్వలంబగు రుచిచేత ఉదకమైతి!
ప్రాణములనునిల్పుటచేత ప్రాణమైతి! 260
వెరసి దేవతలకు మారు పేరువైతి!

జీవకారుణ్య బుద్ధికి జీవితమున
మొదటి స్థానమ్ము నిచ్చిన సుదతివీవు;
ఎక్కడైనను హింసకు రెక్కలొదవి
బాధ పెట్టిననోర్వని భామవీవు! 261

ఆచార్యు లెల్లరు నరువదేడులు నిండ
షష్టిపూర్తి సభలు జరుపుకొంద్రు
మిత్రులు, శిష్యులు మేలు ఘటించంగ
విందులేర్పాటు గావించుచుంద్రు
ప్రముఖుల రావించి పరిపరివిధముల
సన్మాన పత్రముల్ చదువుచుంద్రు
ఉపయోగపడునున్నతోద్యోగులకునెల్ల
సత్కారములు జేసి సంతసింత్రు

కాని, యంతకంటె ఘనముగా జరిగిన
వీడుకోలు సభకు వేడ్క తోడ
శిష్యగణము వచ్చి స్నేహంబు చూపుట 262
కీవె కారణమ్ము దేవ దేవి!

కష్టపడి కూడబెట్టిన కలిమి యన్న
ఇష్టపడి యోగిరమ్ము భుజించుటన్న 263
పుష్టిగలశరీరమ్మును పొందుటన్న
భాగ్యముగను దలంచెడి భామ వీవు!

నిరతము భగవచ్చింతన
పరమగు సద్బుద్ధి జూపు భామిని వీవే!
కరమనురక్తిం బెంచుచు
స్థిరచిత్తము నాకు గలుగ జేసితివీవే!

షష్టిపూర్తి వద్దు, సన్మానమే చాలు
మంచి పనులు చేయు మానవులకు;
పేదవారు లేర ప్రేమ చూపుటకని
నన్ను మేలుకొల్పినావు సాధ్వి!

## కుర్చీ కథ

అమెరికాలోన నారుమాసముల ముందు
జరుగు 'నాట్సు' సదస్సుకు సాదరముగ
రమ్మటంచు నాహ్వానమ్ము రాగ జూచి
పోయిరమ్మన్నది ప్రమీల పొసగ నన్ను.

ఐన నీవిధముగ నర్థాంతరమ్ముగా
నతివ నన్ను విడిచె నవనిలోన;
నింక చేయునట్టి దేమున్నదని నేను
ఫ్లైటునెక్కినాను బాధ పడుచు!

ఆ విమానమ్మునెక్కి నేనరుగు నపుడు
కనుల లోపల నీరమ్ము కడలు కొనియె;
నకట! దుఃఖాబ్ధి నీదుచున్నట్లు గాగ
భారమైనట్టి మది గట్టి పరచుకొంటి! 273

అటుల నొకనాడు పయనమ్ము నధిగమించి
యమెరికా విమానాశ్రయ మందు నేను
దిగితి గుండెను మిక్కిలి దిట్టపరచి
యశ్రువుల్ రెండు నేలపై నదిరిపడగ! 274

అల్మటాసులో నున్న మా యల్లునిల్లు
జేరి; నిద్రలోనికి కొంత జారినంత
కనులముందర నాకును గానిపించె
నొక్క చక్కని కుర్చీ సముజ్జ్వలముగ! 275

ఇంత కంటెను ముందర నిద్ది నాకు
కనుల బడదేమి యంచు నే కనుల నీరు
తుడిచి, కలలోనె శ్రావణి నడిగి చూడ
"నమ్మ కోసము తెచ్చినా"మనుచు బలికె. 276

కుర్చీనిలలోన జూడంగ కోర్కె గలుగ
చిత్రముగ నాదు స్వప్నమ్ము చెదరిపోయె;
స్వప్నమున జూచినట్టివే జగములోన
జరుగు ననియెడి మాటలు సత్యమయ్యె. 277

అప్పటికి బిడ్డ నిద్రలో నాదమరచి
యుండ; మేల్కొన్న యల్లుని నుత్సహించి
యడిగితిని కుర్చి యేదని, యపుడు తాను
జెప్పె దాని చరిత్ర విచిత్రముగను; 278

"అత్తగారు నాలుగు మారులాదరముగ
నమెరికాకు విచ్చేసిన యవసరమున
కూర్చొనంగను తగినట్టి కుర్చి యొకటి
తెచ్చిపెట్టంగ గోరెను తేటపడగ! 279

మేము కుర్చికై యెప్పుడు మీద మీద
యత్నములు సేయుచుండ, నయత్నముగనె
పెద్ద కొట్టులో దొరికెను ప్రేమనింపు
కుర్చి యొక్కటి ముచ్చట గొలుపుచుండి. 280

వెంటనే దాని డాలర్ల విలువ గట్టి
తెచ్చు కొంటిమి యింటికి; తెచ్చి దాని
భద్రముగ జూచుకొంటిమి; పసిడిగద్దె
కన్న మిన్న మా దృష్టిలో కట్టె కుర్చి"! 281

అనుచు నొక గది లోపల నలరునట్టి
కుర్చి చూపించె నల్లుండు కూర్మి యెసగ;
కళ్లు పెద్దవి జేసి నే గాంచినాను
స్నేహభావమ్ము నాలోన చిందులేయ. 282

కళ్ల ముందర ఆ కుర్చి కానబడగ
ధారగా బాష్పకణములు జార దొడిగె;
కోర్కె మీర ప్రమీలయే కుర్చియందు
కదలకుండంగ కూర్చున్న కరణి దోచె! 283

అంత చక్కని కుర్చినేనంతకంటె
ముందు కనులతో గనుగొన నెందు గూడ;
పెద్దలన్నచో పిల్లల ప్రేమ లేవా
యెట్లు మనవలెనో 'కుర్చి' యెఱుగ జెప్పె. 284

కొత్త కుర్చి వచ్చె కొంగ్రొత్త రీతిలో
పాత చైరులన్ని బాధపడగ;
పాత కొత్తలెల్ల ప్రాణుల దేహాల
కంటు గాని, యాత్మకంటువడునె? 285

పాత కుర్చి యున్న పరిధిలో కొంగ్రొత్త
కుర్చి వచ్చి నట్లు కూర్చు బ్రహ్మ
ఓ ప్రమీల! నీకు నుత్తమ దేహమ్ము; 286
ధాత గీత నెవరు దాటగలరు?

ఇంత కంటెను ముందు నీ కెలమి తోడ
కూర్చొనెడి యవకాశమ్ము కూర్చి నట్టి
యాసనమ్ముల భాగ్యమేమనగ వచ్చు! 287
కొత్త కుర్చికాభాగ్యమ్ము కొఱతయయ్యె.

కుర్చి చూచిన చాలును కువలయాన
వేద సిద్ధాంతమే నాకు విదిత మయ్యె;
ప్రకృతి కుర్చి; కూర్చొనువాడు ప్రాణి; యట్లు
చేసినటువంటి వాడె విశ్వేశ్వరుండు. 288

ఎంత బాగుంది! యీ కుర్చి నెటులనైన
భారతోర్వికి గొనివచ్చి భద్రముగను
దాని లోపల కూర్చున్న ధన్యమగును
నాదు జన్మమని తలచినాను నేను. 289

కాని యిది నాకు సాధ్యమ్ము కాదటంచు
నాత్మజ గృహంబులో నున్న నన్ని వేళ
లందు దానిలో కూర్చొని యాత్మసుఖము
ననుభవించితి నా ప్రమీలను దలంచి! 290

కుర్చి ప్రమీల కోసమయి కోరికతో గొనితెచ్చి వారలున్
మర్చిరి గాని, మృత్యువటు మర్వక పోయెను; నా ప్రమీల నే
మర్చి గ్రసించె ప్రాణములు; మంచితనానికి మారు పేరుగా
కూర్చిన దేవదేవునకు గూర్చెద సంస్తుతు లెల్లవేళలన్. 291

రూపము లేని దైవము నిరూపితమయ్యె సమస్త లోక సం
స్థాపితమౌచు; నా యెదుట చక్కని నీయకళంక రూపమే
తోపగ నింత ప్రొద్దు పరితోషము నొందితి; కాని యిప్డు జ్యో
త్స్నిపగ వౌచు డెందమను నాకసమందు ప్రమీల!నిండవే. 292

భర్తయనువాడు తానేమొ పలుకుచుండు
గరిత మాత్రము వాటిని మరవకుండు;
చిత్రముగ నామె, మాటలే చేతలనగ
గుర్తు సేయును ముందుగా గూడు వదలి. 293

యోగము, భోగములందున
యోగమె మరిశ్రేష్ఠ మనుచు నూహించితివా?
భోగమును విడిచి పెట్టియు
యోగముచే జనితివిగద! యూర్ధ్వజగతికిన్! 294

అమెరిక పోయివచ్చితివి యద్భుత రీతిగ నొక్క దానివే,
అమరిక జూపి వచ్చితివి యందరు మెచ్చగ, బిడ్డ యింటిలో
ప్రమదము నింపగల్గితివి భాషణచేత, ప్రవర్తనంబుచే
విమలమతీ! నినుంగనిన వేదనలన్నియు బాయకుండునే? 295

నీవు లేకుండ యీ సారి నే నొకండ
అమెరికా జూచి వచ్చితి, నక్కడున్న
కాలమంతయు నీ జ్ఞాపకాలతోడ
గడచిపోవంగ దైవేచ్ఛగా దలంతు! 296

బిడ్డ, యల్లుండు, పిల్లలు పెద్దదైన
వేదినెక్కి నృత్యము సేయ, వేడ్క మీర
నాల్గు కన్నులతో జూచినాను; వెరసి
రెండునీవైన మరి నావి రెండుగాగ! 297



ఆలించినావు నా యనురాగవచనముల్
నాతిరో పెళ్లైన నాటి నుండి;
పాలించినావు పెంపకమున శ్రద్ధతో
ముగ్గురు పిల్లల ముద్దుగాను;
చాలించినావు శుష్కాలాపములనెల్ల
శాస్త్రముల్ చదివిన సరణిగాగ;
గాలించినావు శ్రీ కైవల్య పదవికై
గోపదేవుడు మోక్ష గురువు గాగ;

ఎన్ని సుగుణముల్ నీలోన వన్నె గలిగి
వరలెనోగాని వర్ణింప వశముగాదు;
పూర్వ జన్మమ్ములో నాకు పుణ్యమిడెడు
స్థానమందున నిలిచిన సఖియవేమొ! 2

పూర్వానుబంధమే పూర్ణమై మననిట్లు
కలిపినదని నేను దలచుచుందు
పూర్వ జన్మములోని పుణ్యమే మనలను
నడిపించె నని లెస్స నమ్ముచుందు
పరమేశ్వరుని యాజ్ఞ పాటించినందున
కలసి మెలగినట్లు దెలియుచుందు
పితృదేవతలకును ప్రేమపాత్రులమయి
యాశీస్సులందినామనుచునుందు

ఎవరు కాల్మోపినంత నత్తింటిలోని
వారికెల్ల సౌఖ్యంబు లబ్బంగగలవొ
యట్టి సాధ్వి జన్మమ్ము కృతార్థమగుట
నిన్ను జూచిన పిదపనే నిక్కమందు. 299

చిలుకూరు బాలాజి చిన్మయాకారమ్ము
దర్శించుకొన్నట్టి తరుణి వీవు
శ్రీశైల మల్లన్న చిద్విలాసమ్మును
పరికించినటువంటి పడతి వీవు
భద్రాద్రి రాముని భద్రమౌ రూపమ్ము
కనులార జూచిన కాంత వీవు
ఏడు కొండల నెక్కి యెంకన్న పాదాలు
స్పర్శించినటువంటి సాధ్వి వీవు

యాదగిరి నరసింహుని నాత్మదలచి
కీసరేశుని కెప్పుడు కేలు మోడ్చి
యుజ్జయిని మహంకాళికి నుడుపులిచ్చి
భక్తి చూపు ప్రమీల! నీ భక్తి లెస్స! 300

సినిమాల కంటెను సీరియల్స్ పై ప్రేమ
నుంచంగ దలచితి వో ప్రమీల!
సీరియల్స్‌లోపల "చిన్నారి పెళ్లి కూ
తు" రటన్న నీకు సంతోషమయ్యె;

హెూటళ్లలో దిని యుల్లసించుటకన్న
నింటివంటకమె నీకిష్టమగును
వంటకమ్ములలోన వంకాయ రైసన్న
పేర్కొన జాలని ప్రేమనీకు

ఇంటి నాశ్రయించి యెల్లవేళల యందు
కంటి రెప్పవోలె గాచుచుండ
సుదతి! నీ వలనను శుభ్రత, భద్రత
కొదువ లేక పోయె కొద్దిగైన.

నిత్యమ్ము నీ దివ్య నేత్రద్వయమ్ముచే
కనుగొనుచుందును కరుణ నిమ్ము!
ప్రతిదినమ్మీవు సన్మతి జేయు పనులనే
యొనరించుచుండెద నూతమిమ్ము!
నిరతమ్ము నీ వున్న నిలయమ్ములోననే
నివసించుచుందును నీడనిమ్ము!
అనుదిన మ్మాత్మ నీవనుకొన్న దానినే
భావించుచుందును బలమునిమ్ము!

నీవు నేనయి, నేనును నీవనంగ
మెలగి నారము, చూచుచు మేలుగీళ్లు;
గడచె నిందాక నీ వున్న కాలమంత
ముదిత నాకీయవలదేమి ముందు చూపు?

ముగ్గురు పిల్లలు మురిసి పోయెడి రీతి
పెళ్లిళ్లు జరిపించు ప్రేమ నీది
కట్నకానుకలను కాదని, సంబంధ
బాంధవ్యములు చూచు పటిమ నీది
పండుగ దినములు పరిగెత్తుకొనిరాగ
సంబర పడిపోవు సరణి నీది
చుట్టపక్కంబులు చూడవచ్చిన చాలు
నాదరంబును జూపు నాత్మ నీది

తోడి వారిని జూచి సంతోషపడుచు
పరుల కష్టాలలో పాలు పంచుకొనుచు
స్వంత లాభమ్మునిసుమంత సరకు సేయ
వెంత మంచిగ నీ వుంటివే ప్రమీల! 303

ఆత్మలు శాశ్వతంబులు; మహత్తర శక్తికి గుర్తులై శరీ
రాత్మలనంగ కొన్ని సమయంబులు జీవన యాత్ర జేసి తృ
ప్తాత్మలుగా గనంబడెదు; నా పిదపన్ తనువుల్ త్యజించి ము
క్తాత్మలుగా విరాజిలునిదంతయుదేవుని లీలయే సుమా! 304

కాశితోపాటుగా కన్యాకుమారిని
కోర్కెతో జూచి రాగోరినావు
మానసగంగోత్రి మహిమను జూచెడి
తలపును బుద్ధిలో నిలిపినావు

శబరిమలను గాంచి చక్కగా నీ భక్తి
చూపంగవలెనని చూచినావు.
రామేశ్వరము వెళ్లి రావలెననియెడి
బలమైన కాంక్షతో బరగినావు

కాని, వీటిలోపల నొక్క కాశి దప్ప
యితరమైనట్టి స్థలముల కేగలేదు;
ఏల సంశయింపగ ఓ ప్రమీల నీవు
తిరిగి జన్మించి వాటిలో తిరుగగలవు!

కామితార్థములిచ్చి కాచెడి దానికి
వేల్పుటావనియెడి పేరుగలదు.
ఆర్తుల క్షుద్బాధ లణచెడి దానికి
అమరతరువనెడి అభిధగలదు.
ప్రాణమ్మొసంగి కాపాడెడి దానికి
సంజీవనియనెడి సంజ్ఞగలదు.
దుష్టుల నెల్లర దునుమాడు దానికి
రామబాణమనెడి నామమలరు

అట్టులే నీకు లోకాన నన్నపూర్ణ
వనెడి నామమ్ము సిద్ధించె నద్భుతముగ;
నీతి దప్పక నిష్ఠతో నిలిచినట్టి
మగువనేరీతి లోకమ్ము మరువగలదు!

నేటి వరకు నేను నిష్ఠతో నిరువది
యేడు గ్రంథములు రచించినాను;
కాని నీదు స్మృతికి గౌరవమ్మొప్పంగ
నొసగుచుంటి కృతిని ఓ ప్రమీల! 307

## ఫ ల శ్రు తి

ఒక్కరి కొక్కరు తోడై
చక్కగ వసియించునట్లు, సతిపతులిరువుర్
మక్కువతో జీవింపగ
నిక్కావ్యము త్రోవ జూపు నింపుదలిర్పన్. 308





# చెన్నప్ప గారి ముద్రిత రచనలు

1. మల్లి పదాలు (కవిత్వం) 1980
2. వేటూరి ప్రభాకర శాస్త్రి వాఙ్మయ సూచిక (పరిశోధన) 1985
3. ప్రాచీనకావ్యాలు - గ్రామీణజీవన చిత్రణ (పరిశోధన) 1990
4. నేత్రోదయం (కవిత్వం) 1991
5. సమాలోచనం (సాహిత్య వ్యాసాలు) 1995
6. బృహద్గీత (బృహదారణ్యకోపనిషత్తుకు ముత్యాల సరాల రూపం) 1997
7. బ్రహ్మచర్యం (వచన గ్రంథం) 1999
8. అమృత స్వరాలు (కవిత్వం) 1999
9. ప్రకృతి పురుష వివేకం (సాంఖ్యదర్శనానికి ముత్యాలసరాలరూపం)1999
10. అగ్ని స్వరాలు (కవిత్వం) 2000
11. సారస్వత లోచనం (సాహిత్య వ్యాసాలు) 2001
12. ఈశావాస్యం (ఈశావాస్యోపనిషత్తుకు ముత్యాలసరాలరూపం) 2001
13. వీరసావర్కర్ (నాటిక) 2002
14. చెన్నప్ప నానీలు (కవిత్వం) 2005
15. చెన్నప్ప పీఠికలు 2005
16. అక్షర కేతనం (సాహిత్య వ్యాసాలు) 2008
17. నయాగరా (గేయ ఖండకావ్యం) 2010
18. అమెరికా! ఓ అమెరికా! (కవిత్వం) 2010
19. ఆ సందుక (కవిత్వం) 2010
20. సమదర్శనం ('ఈనాడు' అంతర్యామి వ్యాసాలు) 2012
21. సుందరకాండ (రామాయణ సుందరకాండకు వచనరూపం) 2012
22. సడిలేని అడుగులు (రవీంద్రుని 'గీతాంజలి'కి లఘుకవితారూపం) 2013
23. తెలంగాణోదయం (పద్యకవితా సంపుటి) 2013
24. శుకోపనిషత్తు (ఖండాంతర ఖండకావ్యం) 2013
25. ఉద్గీథం (ఛాందోగ్యోపనిషత్తుకు ముత్యాలసరాలరూపం) 2013
26. సాహిత్యంలో తత్త్వ దర్శనం (సాహిత్య వ్యాసాలు) 2014
27. మోక్షసాధనలో దశోపనిషత్తులు (ప్ర.భా.) (ఆధ్యాత్మిక వ్యాసాలు) 2015
28. ప్రమీలా త్రిశతి (స్మృతి కావ్యం) 2016